SREE

# TARA CHANDREEYAM.

# తారాచంద్రీయము

[ఐదంకముల నాటకము]

గ్రంథకర్త:

బ్రహ్మశ్రీ వైద్యరత్న:

గూడూరు వేంకటశివకవి గారు.

మొదటికూర్పు 1000 ప్రతులు

పబ్లిషర్సు:

గూడూరు ప్రచురణాలయము,

జి. టి. ఆర్. వేజెండ్ల,

చేబ్రోలుపోస్టు, గుంటూరుజిల్లా.

రజత ముద్రాక్షరశాల, తెనాలి.

1923.

రిజిష్టర్డు కాపీరైట్.]

[వెల రు. 0-14-0.

SREE

# TARA CHANDREEYAM.

# తారాచంద్రీయము

[ఐదంకముల నాటకము]

గ్రంథకర్త:

బ్రహ్మశ్రీ వైద్యరత్న:

గూడూరు వేంకటశివకవిగారు.

మొదటికూర్పు 1000 ప్రతులు

కృతిభర్త:

శ్రీమాన్ శ్రీమద్గుదిమెళ్ల తి. నలనాచార్యుల అయ్యవార్లంగారు,

శ్రీరంగపురము.

పబ్లిషర్సు:

గూడూరు ప్రచురణాలయము,

జి. టి. ఆర్. వేజెండ్ల,

రజిత ముద్రాక్షరశాల, తెనాలి.

1923.

రిజిష్టర్డు కాపీరైటు.

వెల Rs. 0-14-0.

శ్రీ

శా॥ శ్రీనారీమణి నీలపుష్కర దరాశిస్వేల్గు క్రోమిక్రించుచుం
దాన న్వామదిశన్ బ్రదీప్తమగురత్నస్ఫూర్తిశోభిల్ల డరి
దాన న్హాస్యముదళ్కులొత్తఁ ద్రిజగత్త్రాణుండు రంగేశుండ
త్యానందంబిసురింప నెప్పునల నాగ్యాభిఖ్యునిం బ్రోవుతన్ ॥

మత్తకోకిల॥ ఫుల్లపంకజపత్రలోచనుముద్దు పట్టపుదేవియు
త్ఫుల్లపంకజపత్రవైరికిఁ దోడఁబుట్టివెలుంగు స
త్ఫుల్లపంకజ సౌధరాజిని బొల్పెసంగఁ జరించు సం
ఫుల్లపంకజగంధి వల్లనఁ బ్రోచునిల్లెడ నాయకన్.

ఉ॥ శ్రీలుఁడు! ధీమనుజ్వలనశీకృతఖేలుఁడు! వన్యవాక్సుధా
జాలుఁడు! భ్రాతటీకట విశాలుఁడు! శైలవరేణ్యపుత్రికా
భాలుఁడు! శుభ్రవిగ్రహుఁడు! బాలశశాంక కళావతంసుఁడ
ఙ్లీలవచః ప్రవృత్తిఁ బరిశీలన మాకొసగున్ముదంబునన్ ॥

ఉ॥ కంజదళాయతాక్షి! శుచికంజదళోపమ గాత్రిశుభ్రమా
కంజదళాధిరోహిణి సుకంజదళాయత వక్త్రిసచ్ఛుభో
త్కంజదళోద్భవాస్య నవకంజమునొందిన వాణినాదుహృ
త్కంజమునందు నిల్చి పలుకంజను వీయఁగఁ బ్రస్తుతించెదన్ ॥

ఉ॥ ఈయవనీస్థలంబున నహీనయశంబగు భారతంబు రా
మాయణము న్రచించినమహాత్ముల వ్యాసుని వల్మికోద్భవున్
భాయనిభక్తితోఁ గవితపావనసోమ్మృత ధారఁజిల్కఁగాఁ
జేయుమటంచుఁ జిత్తమున శీఘ్రమె సన్నుతులే నొనర్చెదన్ ॥

ఉ॥ వ్యాసనిభుండు సంస్కృతమయామృతరాశికి సోమ్యుండనా
భాసిలు గాళిదాసకవి పర్యనుక్త్రిణముల్లి యాంధ్రవి
ద్యాశతపత్రజాతులను. ధన్యులనన్న యసోమయాజులన్
నీసరఁబోనసీకఁ బదివేల విధంబులఁ బ్రస్తుతించెదన్ ॥

చం॥ నలినదళాక్షుఁగీర్తనగు నాదుగవిత్వమునందు లోపముల్
గలిగిన సత్కవుల్ గణుతిగా మది నెంచ క్షమించు వేడెదన్
లలిఁగుముదాప్తబంధుఁడు గళంకుడునై యమృతాద్యుపాటమిన్
గలభువనంబులందునఁ బొగడ్తకు నెక్కిన చొప్పెఱుంగరే ॥

వ॥ అనియిష్టదేవతాప్రార్థనంబును పూర్వకవిజనస్తోత్రంబును జేసి తారా చంద్రవిలాసంబు నాటకంబుగా నిర్మాణంబు జేయఁదలంచు సమయంబున సమస్త మహీచక్రపాలన క్షోమలపదారవిందచింత నానురక్తుండును గృపకందర్పుండును. శౌర్యకుమారుండును. గాంభీర్యసముద్రుండును. అరికుంజరసింహుండును. ఆక్రాంత సుకవీప్రకరపోషకుండును. వైష్ణవాశీర్వాదప్రవర్ధిష్ణుండును. భారద్వాజగోత్రసంకలితుండును. శ్రీమద్గుదిమెళ్ళ వంశపయఃపారావారరాకాసుధాకరుండును నగు వల నాచార్యుండు.

తే॥ గీ॥ లచ్చితోఁ గట్టి నెచ్చెలి యొచ్చటుండు?
గాలితో భీమనాముఁ డెక్కడఁ జరిచు?

వాణితోఁగూడి బ్రహ్మనివాసమేచటని
నట్టి శ్రీరంగపురినొక్క యవసరమున ||

శా || గీర్వాణాంధ్రకవిత్వ నైపుణులు నొక్కొంకనొప్పారభూ
గీర్వాణావళిదీవనల్ సలుపుచొక్కొంకరంభాదులం
ఫర్వాసేయని వేశ్యలొక్కెడరణ ప్రావీణ్యులొక్క యెడన్
సర్వజ్ఞుల్ స్వజనాదులొక్కయెడ వాస్థానంబునందుండగన్ ||

తే|| గీ|| ఒకతెవింజామరమువీవనొకతెవీడె
యంబులందివ్వ వేరొకయంబుజాక్షి!
కలపముంద గరాజసకలితుండగుచుఁ
గొల్వుదీరెనలన దేశికుఁడుముదమున ||

కం|| అత్తఱిఁబౌరాణికుల
త్యుత్తమగతి,బహుపురాణసూక్తులు దెల్పన్
జిత్తంబలరఁగ వినుచును.
దాత్తతనొకయుక్తిఁ బన్నెధన్యతనందన్ ||

వ|| అదియెద్దియన.

ఆ||వె|| తొంటిరాజులెల్లఁ దొలఁగని కీర్తిని
గృతిముఖంబుచేతన తులితముగ
నందిరంచు డెందమానందమింపొందఁ
బిలువబంచినన్ను బలికెనిట్లు ||

సీ || అమలచారిత్ర! భోధాయనసూత్రభారద్వాజగోత్ర. సర్వజ్ఞవినుత
పాత్రగూడూరి సుక్షేత్రిమల్లయపుత్ర | చిత్రమాధుర్య కవిత్వనిపుణ
వేంకటశివయాఖ్య వినుమీరలొగిఁజేయు | తారాళశాంకంబుదసరనిష్ఠ
మాకంకితమొసంగి మహినిశరశ్చంద్రచంద్రిక హారికరిసమయశంబు

తే||గీ|| నెగడఁ బరిమళయుతమయి నెగడుబసిఁడి
రత్నమును గూడురీతివిరాజితముగఁ
గృతికికర్తవునీవు, నే గృతిపతిని
గానమాకొర్కెఁగొనసాగఁగా నొనర్చు.

వ || అనిబహుమానపూర్వకంబుగా గంధాక్షతలనొసంగిస్వర్ణరత్నభూషణాంబరంబులఁగట్టనియమించి కర్పూరయుతంబుగాఁ దాంబూలంబొసంగి గారవంబు నేసిన నేనపరిమితానంద చిత్తకమలుండ నైమదీయవిరచిత కావ్యకాంతామనోహరుండగు గుడిమెళ్ళ నలనాగ్యాభిధానునివంశ క్రమంబభివర్ణించెద.

వంశానుక్రమణిక.

తే||గీ|| శ్రీకరంబగు రంగపురీవిహారుఁ
డైన.రంగేశ్వరుని కృపనందియున్న

వైష్ణవులయందుగుడిమెళ్ళ వంశమందు
నల్లనాచార్యుఁడు దయించెనుల్లమలర ॥
కం॥ కీర్తిప్రతాపుఁడరి సమ
వర్తి సుగుణములకు, నాట పట్టయిమతిస
ద్వర్తనమున ధరణీస్థలి
వర్తించిన సత్యకీర్తిభానజసముడున్ ॥
కం॥ ఆ తిరుమల నలనార్యుఁడు
పాతివ్రత్యంబునందు భాగ్యమునందున్
సీతారత్నమునకు సరి
యాతరుణీ మణిని జోగమాంబను బొందెన్
తే॥గీ॥ ఆవధూటికిఁ బెంప్రారసమితసుగుణ
నిధులు బురుషార్థవైభవు లధికయశులు
ప్రేమనిర్వురు బొడమిరి గామదేశి
కుండు,లక్ష్మీనృశింహగురుండు,జగతి ॥
కం॥ ఆమహిమలలోనయశ
స్కాముండతివితరణములఁగర్ణుఁడు,గాంతిన్
దామరసవైరి,భుజబల
భీముఁడనా గామగురుఁడు ప్రేముడినెగడెన్ ॥
సీ॥ అణిమాదికైశ్వర్యమందుఁ జూడఁగఁ బదిరెండవ రజితగిరీశమూర్తి
ఘనభాగ్యసంపదలను బొడఁగాంచఁగా । విలసిల్లె రెండవవిష్ణుమూర్తి
ధర్మమధర్మంబు నిర్మలమతి నెంచి । దాఁజెప్ప రెండవధర్మమూర్తి
సత్యవాగ్వైభవసమితికి రెండవ । సత్యహరిశ్చంద్ర చక్రవర్తి
తే॥ యనుచు భూమండలింగల యఖిల జనము
లమితముగ నివ్విధంబు గాననుదినంబు
బొగడఁ దీనులయెడఁ గల్పభూజమనఁగఁ
బ్రకటమతితోడ రామదేశికుఁడు వెలసె ॥
వ॥ అతనితమ్ముండగు లక్ష్మీనృసింహాచార్యుండు
సీ॥ అఖిల వేదాంత విద్యావివేకి పురాణకోవిదుండుత్తమగుణయుంతుండు
నాటకాలంకార నైపుణుండసమానుఁడు భయభాషాకవితోజ్వలుండు
పరమార్థముల కాటపట్టగుధర్మశాస్త్రప్రవీణుఁడు పంచశరసముండు
హరిపద పద్మసేవాపరహృదయుండు బుధజనసుతపుణ్యపూరుషుండు
తే-గీ॥ పరమ వైష్ణవమార్గత త్పరుఁడు గీర్తి
ధనుఁడు,వినయసమన్విత ఘనమనీషి,
సుకృతి లక్ష్మీనృసింహదేశికుఁడు, జగతి
వెలసి పెంపొందె పురజనుల్ వినుతిసేయ ॥

సీ|| ఆరామదేశికుండా రూఢమతితోడ । భాగ్యసంపదను గోపాలురాణి.
వాగ్విశేషములకు వాణిబంభరవేణి । నరశోభనముల కుహూరునిరాణి
రూపవిలాస నిరూఢిమన్మథురాణి । శీలమందున నవ్యశిష్టురాణి
కోమలంబున నలభూమీశ్వరునిరాణి । కల్యాణి! సుశ్రోణి! కంజపాణి! ||

తే|| యనగ వంశసుధామణియైనతాయ
మాంబ నింపెందఁ బొంది సహర్ష లీల
నిరువురంతట రంగపురీశుఁ గొల్చి
యతనిదయచేత నిర్వురసుతులఁ గనిరి ||

తే||గీ|| వారు సత్కీర్తికాములవారితముగ
నగ్రజన్ముండు నల్లనార్యాహ్వయుండు
దీన జనపోషకుండిల దా కర్ణుఁ
డనఁగ, చేరొండెఁ గృష్ణమాచార్యుఁడరయ ||

చం|| ఇరవుగ ధైర్యసంపదన హీనతఁ బెంపగు హేమశైలమున్
నరబలవిక్రమప్రకర । భాగ్యముగల్గిన బాహులేయునిన్
బరమవివేకశీలమునఁ । బ్రస్తుతికెక్కు విదేహభూపతిన్
బరిభవమందఁ జేయఁగల పావన శీలురు వీరలిర్వురున్ ||

సీ|| అవలీలజయలక్ష్మినందిపెంపొందిన గుదికొళ్ళతిరుమల కులులకెల్లఁ
దలమానికంబన వెలసెను గుదిమెళ్ళ । కస్తూరిరంగాఖ్యు నిస్తులయశుఁ
డుభయభాషాకవితోక్త్యలుండఖిలార్థ । కోవిదుం డుత్తమగుణనిధి జయగు
అఖిలవరా వేదవేదాంగశాస్త్రపురాణ । కావ్యనాటకములఁగ అపుమేటి

తే|| అట్టిమహిమ్ముని నంశమ్ము నాథవిశశి
తారకము గా ఘనస్థల్లాదలఁ నియచట
దత్తుఁడై నల్లనార్యుండు ధర్మబుద్ధి
రశికశేఖరుఁడను పేరయశముగనెను.

తే|| వాసవుని చేతి కులిశంబు నాడి పడిన
భోరుకోల్పుచు వారిధి మేరఁ జనిన
ధారుణీదేవితనదగు తాల్మివిడిన
నాడిదప్పదు నల్లనార్యాహ్వయుండు ||

కం|| కులశీలములం బుట్టిన
యిలుజార్చబడిపట్టి యింటి కెక్కుడునన్నెన్
జెలువొందఁగదే జాలిన
కులసతియగు జానకమ్మఁ గోరి వరించెన్.

కం|| ఇమ్మహితలమునఁ గలబల్
కమ్మని గుదిమెళ్ళ వంశఖని సద్గుణబృం
దమ్ముగల నల్లనార్యగృ
హమ్మున సిరిలీలనుండె నతిహర్షముగన్

శ్రీ శ్రీ శ్రీ

# పీఠిక

నేరచించిన నాటకములలోనీ "తారాచంద్రీయము" నాల్గవ యది. నా నాటకములన్నియు స్వకీయ నాటకసభవారు బలుమారులు ప్రదర్శించిరి. ఇట్లు కొంతకాలము జరిగినది. ఇప్పటికి నా నాటకము లన్నియు క్రమముగా ముద్రింప తగుప్రయత్నము లొనర్చుచున్నాడను

పాఠకులగు నోసోదరులారా! బహుకాలముక్రిందటనే రచించియు యింతవరకు ముద్రింపనైతిని. ఏమన? స్వకీయసభవార లంగీకారము లేమింజేసియే సుఁడీ. నావిరచిత నాటకములందు ముద్రితమైన వాటియందిది రెండవది. ఈ నాటకమునందు గలపాటలనుఁ జివర నే ననుబంధముగ జేర్చినాడను. మరియు రంగస్థలముల కనువుగ నుండు నట్లేభాగమైన మార్చవలసినచో నటకులు దయతో దెల్పిన ద్వితీయ ముద్రణమున సవరించుకొందుసని విన్నవించుచున్నాఁడ.

వేజండ్ల,
20—2—23.

ఇట్లు,
గ్రంథకర్త.

—···—

## ఈ నాటకమునందలి ముఖ్య పాత్రలు.



### పురుషులు

—:o:—

చంద్రుఁడు

సుమంతుఁడు-చంద్రుని ప్రధానమంత్రి

ఇంద్రుఁడు-ఉపేంద్రుఁడు-దిక్పాలకులు

బృహస్పతి

బ్రహ్మ

అత్రిమహాముని

నారదుఁడు

విజయుఁడు, విధేయుఁడు, చతురుఁడు, వికటచతురుఁడు } విద్యార్థులు.

సేవకుఁడు

రాక్షసులు

### స్త్రీలు

- . . . -

తార

మదనసాయక-తారదాసి

మోహనాంగి

ప్రదర్శకులకు సూచన.

లిఖితరూపకమగు నా యనుమతిని పొందనివారు

## ఈ నాటకమును ప్రదర్శింపఁగూడదు,

అట్లుగాక స్వతంత్రించినవారలు దావాకు పాత్రులగుదురు.

వేజండ్ల, గుంటూరుజిల్లా. }

గూడూరు వేంకటశివకవి,
గ్రంధకర్త.

శ్రీ

# తారాచంద్రీయము.

## నాంది.

ఉ॥ శ్రీరమణీమనోబ్జ సర ♦ సీరుహ మిత్రుఁడు సన్మునీంద్ర హృ
త్సారసరోజ బంభరుఁడు ♦ దారగుణుండు వినీల నీరదా
కారుఁ డనాది పూరుషుఁడ ♦ కల్మషచిత్తుఁడు వేణుగాన వి
ద్యారశికుండనారతము ♦ ధార్మికుఁడౌ నలనార్యుఁ బ్రోవుత౯॥

( ప్రవేశము: సూత్రధారుఁడు. )

సూ—(సభవంకఁజూచి) ఆహా! యేమినా పూర్వపుణ్యము.

చ॥ సకలకాళాప్రవీణులగు సజ్జనులార! ధరిత్రిలోన నా
టకము లనేకరీతుల దృఢంబుగ నొప్పుచునుండెనైన నే
బ్రకటితమైనయుక్తిఁ బరిపాటిగ నొక్కటియాడఁబూని యిం
చుకభయమోదముల్ బొడము చొప్పునసమ్మతిఁదోసిలొగ్గితి౯॥

ఈ నాటకరాజము నృత్యగీతాభినయ ప్రయోగములతో నాడఁ దలంచిన నాకనుజ్ఞ నీయవలసినదిగాఁ గోరినాఁడ. (వినుట నభినయించి) ఆ. సభ్యుల వాక్యంబులేయివి. యేమని? ఆర్యా! ఆనాటకరాజమతిత్వరితగతిఁ బ్రదర్శనంబు గావించి మాకు గన్నులపండువుగావింపుమనియా? ఆటులైనసరే. (యోచించి) నేనీ సభికులానందించునట్టిప్పని నెరవేర్పగలనాయని సందేహముఁగల్గినది. ఎందుకన.

తే॥ వేదముల బ్రహ్మసదృశులౌ ♦ విప్రవరులు
వివిధశాస్త్రపురాణ కో ♦ విదులుగాన
పరులచేనొప్పు నీసభా ♦ భ్యంతరమున
నిట్టి నాటకమెటులాడ ♦ బుట్టుబుద్ధి.

అయినను నాప్రియురాలింబిలుపించి యోచించెదను. ప్రేయసీ! ఇటురమ్ము.

(ప్రవేశము: నటి.)

నటి—ఆర్యా! ఏమి శెలవు.

సూ—ఇచ్చట నవరసములు విరజల్లఁజాలు నొక్క నాటకరాజమూను దురనవిని సభ్యులందరు సావధాన చిత్తంబులతో మనలఁగార వించుటకు విజయముచేసియుండిరి. ఇక్కార్యంబు నాచే నెర వేరునా? లేదా? యని నాకు సహాయముగా నుండుటకు నిన్నిందు రప్పించినాఁడ.

నటి—నాథా! నాటకములెన్నెన్నో పరిపాటిగానున్నవి. ఇప్పుడిచ్చట ప్రదర్శించెడి నాటకరాజము పేరేమి?

సూ—తారాచంద్రీయము.

నటి—దీనిని రచించినవారెవ్వరు?

సూ—

శా॥ భారద్వాజసగోత్రపావనుఁడు! విద్వత్పూర్ణ వేద్యుండు వి
స్తారోదారుఁడు! గీర్తికాముఁడు! మహాధర్మస్వరూపుండు! సూ
డూరీవంశపయోధిపూర్ణ శశి! సుశ్లోకుండు! మల్లయ కిం
పారంగల్గె ఘనుండు! వేంకటశివాఖ్యానుండు ప్రాసెంజుమీ॥

నటి—ఆర్యా! యిప్పుడితోత్తముల సమ్ముఖంబున నవీన కృతనాటక రాజంబు ప్రదర్శించి గౌరవమందుట చాల కష్టతరము.

సూ—ప్రేయసీ! గీర్వాణాంధ్ర కవిపుంగవులచే రచింపంబడిన యభిజ్ఞాన శాకుంతలాది మహానాటకాలంకార ప్రవీణులగు విద్వత్సమూహంబుల కానందమొసఁగు నటుల మనమీనాటకమును ప్రదర్శింపలేమని తలంచవలదు. ఎందుకన?

తే॥ గుణములెంచును విబుధుండు ♦ కూళయెపుడు
దోషములనెంచు, నెట్లన ♦ భాసురముగ
నంచక్షీరనీరముల గ్ర♦హించుకరణి
నీగదేహమువిడిపుండు ♦ నెఱుఁగుకరణి॥

మన యత్నమునకు దైవయత్న మనుకూల మయ్యేనేని యెట్టి దుష్కరంబగు కార్యములనైన నెరవేర్చగలము.

నటి—ఆర్యా! మీరుశెలవిచ్చిన సాదృశ్యముచే నామనోహరమైనది. కాని! మనమిట్లు కాలయాపనముజేయుచున్న మనలఁ గౌరవింప విజయముఁజేసినసామాజికులు తాలిమినుంచజాలరు. ముందు నేజేయదగిన కార్యమెద్ది?

సూ—సఖి! ముందు నీసభ్యులవీనులకువిందుగా వసంతఋతువును గురించి గానానందరసంబును విరజల్లుము.

నటి-ఉ॥ చంద్రుఁడు మింటఁదేజరిల ♦ జారులు మన్మథబాధనొందని
స్తంద్రితమందమారుతము ♦ సాగఁబికధ్వనులుప్పతిల్లఁగా
సాంద్రనికుంజముల్ విరుల♦సంతతిఁ గ్రాలఁగఁదేటిఝాంకృతుల్
తంద్రజెలంగ మన్మథుఁడు ♦ తల్లె వసంతున కీడుజోడుగన్.

సూ—తే. కాంత! కమ్మని నీకల ♦ కంఠకంఠ
రవముచేనేమొ మోడులు ♦ రహిఁజిగిర్చి
మరియు నానందభాష్ప స ♦ మాజములను
మంచుబిందుల నెపముచే ♦ నించెననఁగ ॥

కావున నిప్పుడే శిష్యబృందముతో సురగురుండీసభకు వచ్చున్నాఁడు. మనమిచట నిల్చుట కార్యముగాదు.

నటి—అవునవును. మనముకర్తవ్యం బాచరింతము. రండు.

(ఇద్దరు నిష్క్రమింతురు.)

( ఇది ప్రస్తావన. )

——:o:——



# శ్రీ
# తారాచంద్రీయము

[ప్రథమరంగము. బృహస్పతి పాఠశాలాగృహము]

(ప్రవేశము: విధేయుఁడు. విజయుఁడు. చతురుఁడు వికటచతురుఁడు)

విధే—విజయా! గురువుగారు వచ్చులోగాఁ బాఠచింతనఁ జేయుదము రమ్ము.

విజ—పాఠచింతన నటుండనిమ్ము. కొంతదనుక మనమందరముగూడి బంతు లాడుకొందము రండు. (అని లేవదీయును.)

విధే—నాకు పాఠము రాదేని గురువుగారు నన్నుబట్టి కొట్టయత్నించును. అదియటుండ మన అయ్యవారు వచ్చువేళ సమీపించినది. ఛీ. నేను నీతో నాడుకొనరాను. నీవంటి కొంటెవాండ్రతో నేమి పని? నేనుఁ జదువుకొనవలయును.

(పుస్తకము చేతఁబట్టి చదువును.)

విజ—చతురుఁడా! మన మిద్దరమైన నాడుకొందము రమ్ము.

చతు—మిత్రమా! గురువుగారువచ్చెడిలోగాఁ బాఠచింతనఁ జేసితిమేని యొంట దెబ్బలుండవు, లేదేని వారాగ్రహపడి మనల నేమి చేయఁజూతురో?

విజ—ఛీ! మీయంత తెలివిహీనులీ లోకమందెవ్వరుగలరు? అహోరాత్రములు చదువు చదువనను కలవరింతయేగాని చదివినట్టు లేదు. వచ్చినట్టు లేదు.

విక—విజయుఁడా? వంజగొడ్డున కడలెక్కువయనునది వినియెఱుంగవా?

విజ—అవునవును. అట్లనేయున్నది వికటచతురా! మనము గూడ మఱి క్రీడ నాడుకొందమా?

విక—ఆ. నాకు వారుపీరివలె గురువువచ్చులోఁగాఁ బాఠమురాదను చింత లేదు. కానిమ్ము. (పిల్లియాట నాడుచున్నారు.)

(విజయునిచేతమణి వికటచతురుఁ డొడసికొని.)

విక-విజయా! గూఢమణి నాచేతికందినది. నేనే గెల్చితిని.

విజ—మిత్రమా? గెల్చినది నిజముగా నేనుగాని నీవుగాదు. నాచేత నుండు మణిని యొడసిదీసుకొని నేనే గెల్చితినని పల్కెదవా? యిఁక చాలింపుము. నీసంగతి నెరిఁగియేకాఁబోలు మన చతురుఁడు, విధేయుఁను నీతో నాడుకొనరాక జదువుకొనుచున్నారు. నేనును వారిఁగలసి చదువుకొనియెద.

(అని మెల్లగా బోవుచున్నాఁడు.)

విక—(బిగ్గరగా) ఓరీ! విజయా॥ యెక్కడికిపోయెదవు? నాయూట జెట్టి మరీపొమ్ము. (అనికొట్టి యీడ్చును.)

[ ప్రవేశము:బృహస్పతి. ]

బృహ-(తనలో) ఏమి యీ వికటచతురుని దర్పము. వీఁడు పాఠశాలకు ప్రవేశించినదిమొదలు నోరుబెట్టుకొని బ్రతుకుచున్నాఁడు. కానిమ్ము. యింక వీడేమిచేయునో చూచెదఁగాక.

(అని పొంచిచూచును.)

చతు-ఓరీ! మన అయ్యవారు వచ్చుచున్నారు.

విక-ఏరీ! ఎటునుండి?

చతు-ఇటునుండియే.

విక-విజయుఁడా! నామణి నిచ్చెదవా లేదా?

బృహ-(చాటుననుండి చూచుచుండును)

(వికట చతురుఁడు మణి నొడిసికొనిపోయి కూర్చుండును)

బ్రహ-(తనలో) నేనిప్పుడేమియు నెరుంగనివానివలెపోయి వీనవల్ల నిజము దెలిసికొనియెద. (అని ప్రకాశముగా)వికటచతురా! నీవును విజయుఁడును లేచిరండు.

విక—[మెల్లగా]విజయుఁడా! మనముచేసిన వెల్లఁనయ్యవారు చూచిరి కాబోలు.

బృహ-లేచిరారేమి? (యిర్వురువచ్చి నిల్చుందురు)

బృహ-వికటచతురా! మీ రేమిటి చేయుచున్నది?

విక——ఏమిలేదు. మేము చదువుకొనుచుంటిమి.

బృహ-నిజముగాఁ జదువుచుంటిరా?

విక——ఇంతమాత్రమునకే నబద్ధమాడనూ-

బృహ-[తనలో] వీడు పాఠశాల కీనెలలో బ్రవేసించుటయు, వెంటనే కోడిబాలునిఁబట్టి యింతపనిచేయుటయు, చూడగా నీ బాలు డెంతకైనను సాహసుఁడేయగు. [ప్రకా] విజయా! యింతకు మున్ను మీరందరుగలసి యేమిటి చేసినది.

విజ——ఏమియున్నది? మేము చదువుకొనుచుంటిమి.

బృహ-నిజముగానా?

విజ——అబద్ధమేమియున్నది.

బృహ-[తనలో] ఈయిద్దరఁబట్టి గొంతుగోసినను నిజముజెప్ప వారు గారు విధేయా! నేనువచ్చొడివరకే వికటచతురుఁడు విజయుఁడు జదువుచుండిరా?

విధే-లేదు లేదు.

బృహ-లేక నేమిచేయుచుండిరి?

విధే-ఆడుకొనుచుండిరి.

బృహ-ఏమియాట?

విధే-గూఢమణి.

బృహ-ఆటయేనా? యింకనేమైన జరిగినదా?

విధే-ఆటలో కలహము జరిగినది.

బృహ-కలహమందు ముందు తప్పెవరిది?

విధే——[తనలో] అక్కటా! నే నేమనిచెప్పుదు. యీ నెలలో బడికివచ్చిన చిన్నవాఁడన్ని నెలలనుండియోయున్న విజయునిబట్టి కొట్టె గదా! వీఁడెంతసాహసుఁడు. నిజముగా వికటచతురునిదే తప్పని యంటినేని గురువుగారు లేనప్పుడు నన్నుమాత్రమున్నించునా? వీడు సామాన్యుఁడుగాడే? (యోచించి)ఐనను వీనికిజడిసియుబ

ద్ధమాడి యందలిఫల మనుభవించుటకన్న, యీ మూర్ఖునిచే లభించు వంచనల ననుభవించుటయే మంచిది. [ప్రకా] ఆచార్యా! తప్పు వికటచతురునిదే.

బృహ–చతురుఁడా! విజయునకును వికటచతురునకును గలిగిన కలహమును గురించి నీవేమి యెఱుంగుదువు?

చతు–ఈవిధేయుఁడు చెప్పినదంతయును

బృహ–[తనలో] ఆహా! వీరిద్దరును సత్యసంధులనుట కిసుమంతయును సందియంబులేదు. పువ్వు బుట్టఁగనే బరిమళించును. [చూచి] యీ వికటచతురుం డేండ్లకుచిన్నవాఁడైనను మూర్ఖమునకు చాలా పెద్దయగును. ఐనను వీనినిప్పుడే శిక్షించితినేని నన్నుఁగూడ నలక్ష్యముగా జూచునేమో? (యోచించి) వీనికిఁ జదువుచెప్పుచు శిక్షించినమేలగు. [ప్ర] వికటచతురా!

విక—ఎందుకు?

బృహ–చదువుకొనుటకు.

విక–చదువు మాకెవ్వరికి నచ్చిరాదు.

బృహ–ఎందుకని?

విక—మాయబ్బకు, మాయన్నకు, జదువు నారంభించినప్రొద్దే యిద్దరయ్యవారలీ లోకమును విడిచినారు.

బృహ–[తనలో] నేను వీనిని మూర్ఖుఁడని తలంచినందులకు నితఁడు సంభాషించినందులకు సరిపోయినది. [ప్రకా] ఛీ. ఛీ. చెడ్డకూతలు గూయక యీముఖముగా గూర్చుండుము.

విక—ఏముఖముగా?

బృహ–తూర్పుముఖముగా.

విక—ఎందుకు?

బృహ–నీ శ్రేయస్సుకొరకు.

విక—మీరా ముఖముగాఁగూర్చుని శ్రేయస్సుగా నుండిరేని మాకు విద్య లెస్సగావచ్చును. లేక మీకేదైన కీడుమూడితే మాకు

విద్యవచ్చునెట్లు ?

బృహ-శుంఠా ! కొంటెకుమాటలుఁ గూసెదవేమి ?

విక-శుంఠా ! కొంటె ! యని యంటిరేని మొదబట్టి గెంటెదరు.

బృహ—(తనలో) వీఁడు మేరమీఱినాకేమాఱుమసలుచుండెనే? నేనులేని వెడనీబాలురనుఁబట్టి యెంతక్రూరకృత్యమైననుఁజేయఁగలఁడు. కనుక వీనినింతట వదలి వేయఁదగదు. కొంతదనుక బెదిరించి యుసిమ్మటగట్టిగాఁశిక్షించియుఁజూచెదను. (ప్రి)వికటచతురా!

(అనుబంధము 1.)

ఉ॥ గొంటితనంబుబూని మదిఁ ♦ గొంకక ప్రేలఁగఁజొచ్చితౌర, ఛీ !
తుంటరి భక్తియుక్ భయము♦దోసి యలక్ష్యముగాఁ జరించెదా
బంటుతనంబుచేత నిను ♦ బట్టి చెటాలున దాడపండ్లు నేఁ
గంటకమూని గొట్టెదఁ జెరా ♦ కాటమునా నొకసారెరాలగన్॥

(అని శిగబట్టి కొట్టయత్నించును.)

విక—(భయముతో) స్వామీ ! నేఁటిదినము మొదలుకొని మీయాజ్ఞ దాటకనుండువాఁడ గావున నాతప్పు క్షమించి జడవదలుడీ. మీకువందనములు జేసెద.

బృహ-మంచిబుద్ధి గల్గి చదువుకొందువా ?

విక-ఆ. ఆ. (జడవదలుచున్నాఁడు.)

[ ప్రవేశము: అత్రిమహాముని-చంద్రుడు. ]

బృహ-(లేచి నిలచి) అత్రిమహామునీంద్రా ! ఈ యుచితాసనంబుపై వసింపుము.

అత్రి-అలాగే వసించెద. (కూర్చుండును)

విక-మునీంద్రా ! వందనములు.

అత్రి-శుభమగుగాక.

విక-బృహస్పతులవారు

బృహ-ఏమి ?

విక-ఏమున్నది. (అని అత్రిమహామునివెనఁజూచి నవ్వును.)

బృహ-ఛీ. వెధవ, నవ్వెదవేమి? నీవు చెప్పదలంచినదానిని చెప్పుము!
విక—ఏమిలేదు. ఈయయ్యగారియొద్ద తెల్లనినార కొల్లగానున్నది. మన పుల్లపెయ్యకు త్రాళ్ళు వేసికొనవచ్చును. కొంచెమడిగి పుచ్చుకొందునా?
బృహ-ఓరీ తుంటరీ! వీరు మహామునులుగనుక గడ్డము పెంచుకొని యుండిరి.
విక—సరే! నేనది నారయనుకొంటిని. అది యటుండనిమ్ము. యీ యయ్యనెత్తినబెట్టిన చుట్టకుదురు మన దొంతికుండలక్రింది క క్కరకువచ్చునేమో చూడుడి.
బృహ-కుంకా! అది చుట్టకుదురుగాదు. వారు మహాజట్టిలులుగనుక జడలు ధరించియున్నారు.
విక—స్వామీ! కుంకయంటె వంకరేమిగలదు? వీరిచేతినున్న కుండ నడుగుదునా?
బృహ-అది కుండగాదు కమండలము. నీవిట్టి దుర్భాషలాడక నూర కుండుము.

(అని కొట్టబోవుచున్నాఁడు.)

బృహ-ఆ॥ మునివరేణ్యమీర ♦ లనఘులిత్తరి నరు
దెంచినంత నస్మ ♦ దీయగృహము
పావనంబుజెందె ♦ మీవలసినపనుల్
దెలియబల్కుమయ్య ♦ తెల్లమిగను॥

అత్రి—దేవగురు! ఆకర్ణించుము.

తే॥ గీ॥ మాకుమారుని రూపర ♦ మాకుమారు
నెల్లవిద్యలఁజదివించి ♦ యుల్లమలరఁ
బండితునిజేసి కీర్తి భూ♦మండలమున
నిండగాఁజేయుమయ్య మ♦నీషిముఖ్యా!

తే॥ గీ॥ ఇదియటుండగ నెండ క♦న్నెరుఁగడింక
నాఁకటికి నోర్వఁగాజాల ♦ డీకుమారుఁ

డట్లుగాన, దయారసం ♦ బతిశయిల్లి
బోవవే, నిర్జరాచార్య ♦ నీవు వీని॥

బృహ-మంచిది. నేనీ చిన్నవాని నెల్లవిద్యలయందతినిపుణునిగాఁ జేసె దఁగాని యీతని నిచ్చోవిడచి మీర లాశ్రమంబునకు వేంచే యుడి.

అత్రి-అలాగే బోయివచ్చెద. కుమారా! నీవిచ్చోనుండుము.

చంద్రు-తండ్రీ! అత్తిబుసీందా!:-

విక-అయ్యా! అది తుడుచుకోను.

అత్రి-అదేమిటి?

విక్ర-అదే. అదే. ఆయబ్బనడుగండి.

అత్రి-ఛీ.ఛీ. భ్రష్టా! వదరకు.

విక-అయ్యా! భ్రష్టుఁడంటే నష్టముగద్దా?

అత్రి-ఈతూరి నోరెత్తితివేని తగినంతశిక్షఁ జేసెదఁ దూరముగాఁ బొమ్ము. (అని కొట్టబోవు చున్నాఁడు.)

చంద్రు-నాన్నగారూ! నన్నయ్యవారు పత్తుకొని తిత్తునో! కొత్తునో! కోదండము బత్తించునో. నేనొంటిరిగానీపాతశాలలోనుండలేను.

విక-ఓహో హో. పాతశాలగాదు. ఇది క్రొత్తశాలేనండి. చూడండి.

అత్రి-ఓరీ! పాతశాలగాదు. పాఠశాలయని చెప్పుచున్నాఁడు.

విక—స్వామీ! యింతమంది వినునట్లీతండు పాతశాల యనుటయు, మీరు పాఠశాలయనిచెప్పుటయు, సరసముగానేయున్నది. మీ మాటలు వినినవారందరు సంతోషించుచుండిరి.

అత్రి-పలుకాకీ! అట్లుగాదు.

విక-ఇంకెట్లు?

అత్రి—ఈచంద్రుఁడు చిన్నవాఁడగుటచే చిలుకపలుకులరీతి ముద్దు మాట లాడుచుండెను.

విక-అటులనా? సరే.

అత్రి—చంద్రా!

చంద్రు-ఏమి నాన్నగారూ.
అత్రి- సీ॥ మాపుత్రరత్నమా ♦ మర్యాదగానీవు
నేడెల్లునీతులు ♦ నెమ్మివినర
సొమ్ములలోన ని ♦ జమ్ముగా విద్యా ధ
నమ్మును మిగిలిన ♦ సొమ్ముగలదె?
గనపసిండికి చెలు ♦ వునకు వాసనచిత్ర
మునకు ప్రాణముపోల్కి ♦ మనుజున కె
దెచ్చుగావున, నీవు ♦ హెచ్చుగా దేవుని
సేవించినటు గురు. ♦ సేవఁజేసి
తే॥ గీ॥ సకలవిద్యల శ్రద్ధతో ♦ సంగ్రహించి
గురువుచే దీవనలబొంది ♦ పరమహర్ష
మానసుఁడవయి సెలవంది ♦ మందిరమ్ము
జేరఁగారమ్ము సత్కీర్తి ♦ జెందతండ్రీ!
( అనుబంధము 2. )

చంద్రా! మేమప్పుడప్పుడువచ్చి నీపైఁదప్పులెన్నకుఁడని యిప్పలుకులవెలది పతితోఁ జెప్పెదముగావున నీవిప్పలుకులకొప్ప నయిప్పుగా నిప్పరంవిశాచార్యు చెంతనుండి దండిపండితుండవుగమ్ము.
చంద్రు-తండ్రీ! మీయాజ్ఞ దాటక నుండువాఁడ-
అత్రి-కుమారా! నేనుపోయివచ్చెద నిక నిల్వుము.
చద్రు-చిత్తము. (అత్రి నిష్క్రమించును.)
బృహ-చంద్రా!
చంద్రు-ఏమి గురువరా?
బృహ--నిన్ను బదు నెనిమిది విద్యల నతిత్వరితగతిఁ జదివించి యీశఁగా
మండలంబున నిన్నెదురించ బుధులు లేరనుపించుటయు గాక నా
యంత వానిగాఁ జేసెద నికఁ జదువుకొందువురమ్ము.
చంద్రు-చిత్తము. (అని సమీపించి కూర్చుండును)
బృహ- శ్లో॥ “శుక్లాంబరధరంవిష్ణుం శశివర్ణం చతుర్భుజం

ప్రసన్నవదనంధ్యాయేత్ । సర్వ విఘ్నోప శాంతయే ”
( ఇది చంద్రుడు చెప్పకొనవలయును )

బృహ-(స్వ) ఆహా ! యీచంద్రుని బుద్ధికుశలత యెంతని బొగడుదు. నానోటిమాట వెడలి దాటకమున్నే గ్రహించి బహురచనగా జదువుచుండెను. ఏమి ! వీని తెలివి. (ప్ర) చంద్రా ! నేను వచ్చునంతకు నీవీగ్రంధంబు తెల్ల సాంగమ్ముగాఁ జదివి యందలి సంగతులనెల్ల సంగ్రహించుము.

చంద్రు-ఆలాగే చదువుకొనియెద. (అని గ్రంథంబులు గైకొని చదువును)

(బృహస్పతి నిష్క్రమించి కొంతసేపటికి మరల ప్రవేశించి)

బృహ-చంద్రా ! గ్రంధంబులఁగల సంగతుల సంగ్రహించితివా ?

చంద్రు-ఆ. గ్రహించితిని.

బృహ—అటులైన అబ్జశబ్దమున కెన్ని యర్థములు గలవో బహుజాగరూకతతో వినిపింపుము ?

చంద్రు-వక్కాణించెద శ్లో॥ “అబ్జప్పద్మేబ్జునే హేమ్ని | మీనేచంద్రే ప్రభాకరే” ఇతివిజయః॥ “అబ్జప్పద్మే సుధాయాంచ | నవనే పావకేధనే స్కంద్రే చంద్రేశ్వేతవాహే | సముద్రేకనకేనిధౌ| అబ్జస్సుధాయామింద్రాచ నిధౌశక్తి ధరేనవ | ఇత్యుత్పలమాలాయాం ॥ అబ్జశబ్ద మిన్నింటియందు వర్తించును.

బృహ-(సంతోషముతో) చంద్రా ! నీవు నాయంత చదువరివైతివి. గావున నేనుకొన్ని ప్రశ్నంబులిచ్చెద వాటికిఁ దగు సమాధానంబు జెప్పుము ?

చంద్రు-గురువరా ! మీప్రశ్నంబులకు సమాధానంబిచ్చుటకే నెంతవాఁడను. ఐనను నాకు దోచిన తెరంగున నుత్తరంబు లిచ్చెద. తెలవొసంగుడు.

బృహ-చంద్రా ! ఈభువనమున కేదిదిక్కు ?

చంద్రు-సత్పురుషులు,

బృహ-సర్వలోక సమ్మతుండెవ్వడు ?

చంద్రు-గర్వహీనుఁడు.
బృహ-మృత్యజీవుఁడెట్టివాఁడు ?
చంద్రు-(యోచించి)

తే॥గీ॥ సప్తసంతతులందు బ్ర ♦ శస్తిగాంచు
వాఁడు! ఘనవిద్యనేర్చిన♦వాఁడుసుకృత
మందువాఁడు! సు! గృతి ♦ జేసినట్టివాఁడు
నీతిదప్పనివాఁడు! సూ ♦ భూతలమున.

బృహ-ఈలోకమందు నమ్మదగిన వారెవరు?
చంద్రు-తే॥గీ॥ భర్తదాపున నీవదై ♦ వంబటంచు
నావలకు మోముద్రిప్పంగ ♦ నాగ్రహంబు
దాటెనని వాడిబోనాడి ♦ తగుదునంచు
దిరుగుస్త్రీలను, నమ్మట ♦ ధీమతంబె ?

బృహ-ఇఁక నెవ్వరైన నుండిరా?
చంద్రు-తే॥గీ॥ భూతలంబునగలయట్టి ♦ భూపతులకు
శ్రోత్రములె నేత్రములుగానఁ ♦ జూచిశిక్షఁ
జేయబూనక నెవరేని ♦ చెప్పుమాట
నమ్మిశిక్షించు నృపతిని ♦ నమ్మదగునె?

బృహ-బళా! మంచిగానున్నవి. యీలోకమందు హాలాహలమును మించినదేది?
చంద్రు-బ్రాహ్మణోత్తముల ధనము.
బృహ-చంద్రా! నాప్రశ్నంబులకు దగు నుత్తరంబులుజెప్పి నన్ను పరితోషమందజేసితివి. నీకు శుభమగుగాక.
చంద్రు-గురూత్తమా! మీదయారసంబుగల్గ నాకేమికొరంత?
బృహ-వత్సలారా! యిప్పటికి చాలవేళయైనది. గాన మీరందరు నిలయములకుంజని సాదంబు మెసవిరండు. నాకును యనుష్ఠానకాలమైనది. చంద్రా! మనముఁగూడ పోవుదమురమ్ము.

(అందరు నిష్క్రమింతురు) అవనికజారును.

# తారాచంద్రీయము

ద్వితీయాంకము-

ప్రథమరంగము - బృహస్పతిగృహము.

[ప్రవేశము:-వికటచతురుఁడు, బృహస్పతి కూర్చునియుండ] సేనకుఁడు

సేన-బృహస్పతులవారు నమస్కారములు.

బృహ-జయమగుగాక. నీవిపుడిచ్చటికే తెంచిన కార్యమేమి?

సేన-కం॥ సురపతి జన్నమొనర్పఁగ

దిరమతినిదలంచితోడి తెమ్మనె మిము స

త్వరితగతి, వెడలి సవనము

బతునడి నెరవేర్చిపూజఁబడయుఁగవలయుꣳ॥

( అనుబంధము 3 )

బృహ——సరే మంచిది. నీవు నగరున కరుగుము. నీవెంట నేనును వచ్చెదను.

సేన-చిత్తము (నిష్క్రమించును)

బృహ-వికటచతురా! తారాసతిని యిచ్చటికిఁదోడ్కొనిరమ్ము.

విక-చిత్తము (నిష్క్రమించును)

[ ప్రవేశము:- తార, మదనసాయక ]

తార-నాథా! వందనములు.

బృహ-మంగళాంగీ! మంగళమగుగాక.

తార-మీరునన్నిచటికి బిలుపించిన కార్యమేదియో తెలుపఁగ వేఁడెద.

బృహ-(కొంచెమూరకుండి) సఖీ! ఒక కఠినమగువార్త నీచెవినివేయ వలసి వచ్చినది.

తార-(తొందరగా) అంతకఠినమగువార్త యేది?

బృహ-ఏమియున్నదీ. నేను నిన్నెడబాయువలసిన కార్యమొకటి తటస్థించినది.

తార-[స్వ] నాకోరిక నేటికి చేకూరివచ్చినది. [ప్రి] నాథా! అది యెద్దియో తెలుపవేఁడెద.

బృహ-దాపరమేల? శతరాయుధుండు సవనంబు సంఘటించదలంచి సత్వరంబుగా నన్నుఁ దోడ్కొనిరమ్మని సేవకునిబంపియుండె. గాన నేనచ్చటికరిగి త్వరితగతి దిరిగివచ్చెదను.

తార- [సిగ్గభినయించుచు] (దీనత్వముతో)

( అనుబంధము 4 )

సీ॥ ఇంటనేనుండ మీ ♦ వెంటనేవచ్చెదఁ
బంచాస్త్రుడిటుకంట ♦ గించెనకట
గొంటుతనముబూని ♦ తొంటిప్రేమల నడు
గంటఁజేయుట న్యాయ♦మగునె? యకట
ముమ్మరంబైన మో♦హమ్ము గ్రమ్మెనుమిమ్ము
బాసిన క్షణమైన ♦ బ్రతుకనకట
పాపిష్ఠియాబ్రహ్మ ♦ పగబూనియిర్వుర
నెడఁబాపఁగామది ♦ నెంచెనకట
తే॥ గీ॥ ధాటిగా నెన్నుదుటిగీత ♦ దలఁగదకట
యెన్నిజెప్పిన రుచిగల్గ ♦ దేలనకట
కఠినమా మీమనంబింక ♦ గరుగదకట
ఏటికీకంతశోష? నాకేల? నకట!

బృహ-[స్వ] ఏమీ! యీతార ప్రణయకలహారంభ సంభాషణ సూచించుచున్నది? [ప్ర] ( అనుబంధము 5 )

ఉ॥ ఇంతిరో చింతయేల? మన ♦ యింట శశాంకునినుంచి నేశచీ
కాంతునిజేరియజ్ఞము చో♦కాటముగానెరవేర్చి యిప్డు కా
సంతలో నాతనిన్బరమ ♦ హర్షమునన్దగఁదేల్చి గౌరవం
బెంతొగ నందివచ్చువర ♦ కీతని బ్రోచుచునుండు మిచ్చటన్॥

నేను తిరిగివచ్చువరకు నీవీ వియోగరుజకు లోబడక సంతోషం బుగా నుండుము.

తార-నాథా! ఒంటరిగా నీయింట నుండలేను. మీ వెంట వచ్చునట్లా జ్ఞాపించుటకు మీకాభావజుం డభిప్రాయంబు గల్గించుగాక

బృహ-అవును నీసంగతి నేనెఱుంగనా? నీవభయము సుభంబెఱుంగనిదాన వగుటచే నిట్లు బల్కితివికాని! నేనొక్కసంగతిఁ దెల్పెద.

సీ॥ వినుము సత్కీర్తిని ♦ విపులంబుగాఁగను
ఘనవేణిచిత్తవై ♦ కల్యమువిడి
మగఁడింటలేని సమయమందు భామిను
లగణితమగుసౌఖ్య ♦ మందఁగోరఁ
దగదు, కురులుదువ్వ ♦ తగబూలుదురుమంగఁ
దగదు, మృష్టాన్నంబు ♦ దగదుదినఁగఁ
దిలకంబు సొగసుగాఁ ♦ దిద్దరాదదిగాక
కలపంబుబూయరా ♦ దలరుచల్వ

తే॥ గీ॥ చీరలను గట్టరాదట్టి ♦ చిహ్నములను
ఘనపతివ్రతలుందురు ♦ కౌతుకమున
గనుక ననుభగవంతుని ♦ గానెనీవు
మనమునందున నేప్రొద్దు ♦ మరువకుండు॥

ప్రియా! నీవీ పతివ్రతా లక్షణంబుల నతిక్రమించక నారాక కెదురుఁజూచుచు నీయింటియందెంతో సంతోషముతో నుండవచ్చునే సంశయించెదవేమి? యిదిగాక,

గీ॥ వనితచంద్రుడు వయసున ♦ బాలుఁడయ్యు
పరువమగు దెల్విలోఁబెద్ద ♦ భవనకృత్య
వర్తనలనను మరపించు ♦ వాఁడు వీనిఁ
బ్రియునిగానెంచి బ్రోవవే ♦ భీతనేత్రి!

వికి-ఐహి. హి. హి. హి. (వికటముగ నవ్వును.)

బృహ-ఏమిరా ఇకిలించెదవు.

విక-ఏమిలేదు. ప్రియుఁడనగా మగడుగదా ? మీరిట్లేల బల్కితిర నే ?
బృహ-ఓరీ! ప్రియశబ్దము ప్రేమగలవానియందుఁ జెల్లును. గనుక నేను చంద్రుని ప్రేమగల శిష్యునిగానెంచి బ్రోవుమంటినిగాని మొం డుగాదు.
విక—గురువరా! ఒక్కొక్క శబ్దమున కనేకయర్థంబులుండును. ఐన ను మీరీ శబ్దంబున కిట్లూహించి పల్కితిరిగాని మనయమ్మ గారి యభిప్రాయము వేరొక యర్థంబుపై బోవునేమో ?
బృహ-ఛీ. ఛీ. వదరకు మాతారాసతి పరమపతివ్రత యగుటచేఁ గలలోనైనఁ జిత్తఃముచెదిరి చెడుపనులఁజేయ నోడంబడదు.
విక-అమ్మగారిసంగతి అయ్యవారికే యెరుక. ఇతరులకెరుకయగునా
బృహ-నిజము. (తార భయమభినయించుచు తలవంచుకొని)
తార_ ద్వి ప ద.

ఏమనుదాన నే | నెట్లుసహింతు
నోమనోహర! మీవి | యోగసాగరము|
నేలాగునీదు దు | నెవరు దిక్కరయ|
నోలగమనతలం | పొక్కటెగాన|
విరహామగ్నలమయ్యె | వినుము స్త్రీపురుషు
లరయక్షీరోదక | న్యాయంబురీతిఁ
గలసిమెలసియుంద్రు | గద మీరలెపుడు
చెలిమిసంపదలం | చెడువారుగాదె
యేనుజేసిన తపం | బేమకోగాని
జానుగా యజ్ఞదీ | క్షల గొన్నినాళ్ళు
నిక్కమా తీర్థాల | నే కొన్నినాళ్ళు
లొక్కప్రొద్దులచేత | నొగికొన్నినాళ్ళు
ఋతుదినంబులటంచు | నెంచి కొన్నాళ్ళు
లలితశయతపముల | నట కొన్నినాళ్ళు
సరవిగాఁబన్ను వే | సటఁగొన్నిఁనాళ్ళు

పసుపంపు ప్రాయ మి । ప్పగిదిగా నేగ
నెన్నడు మీకౌగి । లెరుగంగ నైతి
జెన్నుగానిపుడు మీ । చెంతనుండుటకు
దిన్నగా నోచనై । తినిగదా మరుని
జన్నమునకు సాటి । జన్నమున్న దియె॥

నాథా! నామనవి నంగీకరించి మీ రిచ్చటనే యుండవలయునని కోరుచుంటిని.

బృహ — కాంతామణీ! సురవరుని శాసనం బతిక్రమించి నేనిచ్చట నుంచుట ఘనమగునా? నామాటవినుము. నీకేమి భయము? నేను దిరుగ వచ్చువరకు నీవీ మునికుమారుని "నీ కుమారునిగా" నెంచి పోషించుచుండుము.

విక — బాగు బాగు. ఎక్కువచదునరులకు మిక్కిలి చపలముండువన్న సామిత సూటిగా దగిలివచ్చినది సుమండీ.

బృహ — ఏమిటీ! తగిలివచ్చినది. తిరిగిచెప్పుము?

విక — స్వామీ! కోపమువలవదు. నీ కుమారునిగా జూడమంటిరి గదా! యీయయ్య మనయమ్మకు మన్మధుండని యెంచియేనా? మీరు శెలవిచ్చినది.

బృహ — ఓరీ తుంటా! నీయొక్క కుమారునిగాఁ బోషణ సేయుమంటిని గాని వేరుగాదు.

విజ — స్వామీ మంచికార్యమేయగు. తెలియకబల్కి తిని. చెంపలువేసి కొనవచ్చును.

బృహ — ఛీ. వెధవా! వదరకుము. (అనికొట్టబోవుచున్నాఁడు.)

బృహ — ప్రాణకాంతా!

సీ. ముల్లోకములఁగడు ♦ జల్లనిచూపులఁ
జల్లబోచెడు దేవ ♦ వల్లభుండు
పిలువనంపుటచేత ♦ వెడలుచుంటిని నిన్ను
విడిచిపోవుటకు నా ♦ కడుగుబడునె?

నీరూపుజూడని నిమిషము ♦ తార తా
ర, యటంచు మదిగల్గ ♦ రపమునట్టి
యేనచ్చటికి బోయితేని ♦ నా ప్రాణంబు
లిరవుగా నీమేని ♦ సరసియందు
తే॥ కీ॥ నిలచియుందును లేకున్న ♦ నిలువగలనె?
యంతవరకెట్టనోయట్ల ♦ నతిథిపూజ
బరగసల్పుచునగ్నులే ♦ మరకయుండు
శిష్యుఁడగుజంద్రుబోవ్రు ♦ రాజీవనేత్రి!

తార— ప్రాణేశ్వరా! నేను మిమ్మెంత వేడుకొన్నను జాలిబొందరేల? [యోచించి] మిమ్ముబాసిన నేనెట్లు బ్రతుకగలను? మీరిలు వెడలిపోవుట నేనుజేసికొన్న పురాకృత కర్మముగాబోలు.

బృహ—ప్రియకాంతా! నిన్నువిడిచి క్షణకాలమైన యూడలేసిది యుండ గల్గినది నీవెరుఁగవా? నాకుదడవగుచున్నది నామాటకు మరు మాటలాడక నీవీయింటనుంటివే౨ వెంటనే తిరిగివచ్చెద నీసం గతి నాకుదెలియదా?

తార—నేనీముసలివాని నుండవలసినట్లెక్కుకు బలవంతముఁ జేయదగదు [ప్ర] నాథా! పతివ్రతలు పతిశాసనం బతిక్రమించుట పాడిగా దనునది నాకెరుక లేదనుకొంటిరా? తెలిసియుండియు మీ పైగలిగియున్న మోహమున నన్నిట్లుయ్యెలలూవుచున్నది. ఐనను మీమాటఁ జవదాటలేక నుంటిని. (స్వ) కానిమ్ము. నేనాత్మ కుమారునివలె నీ యత్రికుమారుని భావించుకొనిభావజ తాపం బపనయించుచు పోషించుకొనయెదగాక.

క॥ ఇదిగాక నేటినుండియు
సదమల చారి ♦ త్ర! విధుఁడు జక్కని ప్రియుఁడో
గదనీకుఁ బ్రియుకు ♦ మారుని
ముదమొదవగఁ దలపుచుండు ♦ మునిజనవంద్యా॥

నాథా! మీరలిచ్చట విచారంబులుమాని యచ్చటికిఁజని క్రతువు

నిర్వర్తించి తిరిగి త్వరితముగాఁ దయచేయవలయునని కోరిక.

బృహ-మంచిది. పోయివచ్చెదను నీవు గృహంబున కేగుము.

తార-చిత్తము. (అనుబంధము 6) (నిష్క్రమించును)

బృహ-చంద్రా!

తే గీ॥ మున్ను జదివిన శాస్త్రంబు ♦ లన్ని మరల
నిరతమును బఠియింపుచు ♦ నేర్పుమీర
నాదు సాంగత్య మెడలిన ♦ నాతి నీవు
గావు, మస్మద్వియోగ దుః ♦ ఖంబుదీర॥

విక-బళా. బళా. బాగుగా సెలవిచ్చితిరి సుమండీ.

బృహ-ఏమిటి. నేనేమంటిని?

విక—ఏమిలేదు. మగనికొరకు వగలఁబడు మీ మగువనుఁ జంద్రుని బ్రోవవలసినట్లుగా మీరన్న వెంటనే చంద్రునికి సంశయముఁదీరియుండును.

బృహ-సంశయమేమిటి?

విక—అయ్యా! మీరింటనుండరని మీకు జేయు పనులన్నియు మన యమ్మగారిని గూర్చుండఁబెట్టి యీ చంద్రియ్యను జేయమన్నట్లు స్పష్టమగుచున్నది.

బృహ-ఓరీ! పోకిరీ! పలువకూతులు గూసెదవేమి?

విక-మరేమియుగాదు. పని. పని. లెండి.

బృహ-ఓరీ! తుంటరీ! దానియర్థమది గాదు.

విక-ఇంక నేదో సెలవీయవేదా?

బృహ-తార చిన్నది గనుక నేను లేనని దుఃఖపడకుండునట్లుగా జూచుచుండవలసినదని నుడివితినిగాని యొండుగాదు.

విక-స్వామీ! మాటలు నేర్చినవారితో మాట్లాడగలవారెవ్వరు?

బృహ-ఛీ, వదరకుము. చంద్రా! నేనుపోయివచ్చెదను.

చంద్రు-చిత్తము. మీయాజ్ఞ దాటక నుండువాఁడ.

విక-నీవట్లనే జేయుము. (అందరు నిష్క్రమింతురు)



# తారాచంద్రీయము

## తృతీయాంకము-

[ప్రథమరంగము - తారమందిరము లోభాగము]

[ప్రవేశము:- తార కూర్చుని కన్పట్టును]

తార--[స్వ] నాపీడ వదలినది. నూరుగజముల యెడముగానుండ మునలికంపుగోట్టు సురగురునకు రూపవయోవిలాసాది శుభలక్షణములచే నొప్పెడి నేను కపటవృత్తిఁబూని "మిమ్మెడబాసియుండఁజాలననఁగా" నామాట నిజమని నమ్మిపోయెను. ఏవారైన నూరికిపోయిన వాని నూరేగునట్లు జేసిరేని వారిని నేనొకదేవునిగ భావించుకొని చంద్రునితోఁ గలసిమెలసి సుఖముగా బ్రతికెదను. (యోచించి) ఆహా! నేడు మొదలు పంచశరుని బరిహసించు హిమాంశుని దైవంబుగాఁదలంచి బద్ధానురాగనై యాతనితో యథేచ్ఛగానుండ నోమినపుణ్యా మింతయంతయని కొనియాడశక్యమా? [ప్రి] మదనసాయకా!

మద-[ప్రవేశించి] ఏమిశలవు

తార-పాఠశాలలోఁజదువుచున్న చంద్రునియొక్కసారి యింటికిరమ్మని చెప్పుము.

మద-ఎందుకు?

తార-ఆడుకొనుటకు

మద--[స్వ] ఈమె పతివియోగంబుచే నీయింటియందొంటరిగానుండ భయముజెందికాబోలు! చంద్రుని యాడుకొనుటకు పిల్చుకొని రమ్మని శలవిచ్చినది. (యోచించి) ఈ యింట దానొంటరిగా

నుండ లేకున్న నేనుంటినిగదా ? నన్ను సహాయముగాఁ గోరుకొనఁదగదా ? నాతో నాడుకొనఁదగదా ? (కొంచమూరకుండి) కాదు. కాగు. యీతార కాతారా పతియందు భ్రమదగిలియుండి యీపన్నుగడఁబన్నినదని తోచుచున్నది. (ప్రి) పోయి వచ్చెద. (నిష్క్రమించును)

[పునఃప్రవేశము:-మదనసాయక చంద్రునితో]

తార-చంద్రా ! రమ్ము. యీపీఠ మలంకరించుము.

చంద్రు-(కూర్చుని) అమ్మా ! నన్నుఁబిలచిన కారణమెయ్యది ?

తార-చంద్రా ! చెప్పెదను. నన్నమ్మాయనకుము.

చంద్రు-మరెట్లు బిలువవలయును ?

తార-కొమ్మాయని.

చంద్రు-(కొంచమూరకుండి)తల్లీ ! నన్నుబిలచినకతంబు శలవీయవేడెద

తార-(చిరునగవుతో) చంద్రా ! తెలుపవలెనా ?

(అనుబంధము 7)

సీ॥ ముచ్చటాడరప్రేమ ♦ ముప్పిరిగొనెసుమా
పచ్చవిల్తుంజెద ♦ బగులునట్లు
పద్మబాణంబుల ♦ బట్టిగొట్టగఁజొచ్చె
నిదొజూడు తమిహెచ్చె ♦ గదరనేటి
కొంటిగసబ్బితి ♦ వారినాకెమ్మోవి
పంటితోనొక్కుచు ♦ జంటితేస
నంటఁగ్రోలితివేని ♦ తుంటరిమరుఁడడు
గంటిపోవటులగా ♦ కుంటుప్రాణ
తే॥ ములన్ను, దోడఁగబూను ని♦ప్పుడువిధాత్రు
కతుణమనపయిరంజిలె ♦ గాన త్రిదశ
వరగురుండూరికేగె ని♦ప్పట్లరాడు
నామనోరధ మీడేర్చు ♦ నాణెగాడ !

మదనసాయకా! యీచంద్రునికొక్క పీఠంబు దెచ్చియుంచుము
(పీఠిక దెచ్చి వేయుచున్నది.)

తార–ముద్దుసామి! యిమ్మదనసాయక పచ్చలగద్దయనొద్దిక గా దెచ్చి యుంచినది పెక్కుసుద్దులతో బనియేల? ప్రొద్దుబోవుచున్నది.
నీవీపీఠంబుపై గూర్చుండుము. (చంద్రుడు సంశయించును).

తార–సంశయం బేటికి? కూర్చుండుము.

చంద్రు–చిత్తము. (కూర్చుండును)

[ప్రవేశము: మోహనాంగి] (ఒకనైపునుండి)

మోహ–మదనసాయకా! మదనసాయకా! తారలేదటే?

మద–ఉన్నది.

మోహ–ఏమిచేయుచున్నది.

మద–కొంచెము నిదానించితివేని బయలునకువచ్చును.

మోహ–చెలీ! తలుపుదీసితివేని తారతోనొక సంగతిమాట్లాడిపోయెద.

మద–ఉండుముండుము. తొందరించకు.

మోహ–నీపుణ్యముగాని నేను తొందరగా పోవలెనే.

(మదనసాయక తలుపు దీయుచున్నది.)

మోహ–(యోచించి) చెలీ! లోపలమాట్లాడు వారెవ్వరు?

మద–ఎవ్వరుండిరి?

మోహ–ఎవ్వరులేరా? అట్లైన నేను వెళ్ళవచ్చునా?

మద–(నిరుత్తరయగును)

మోహ–చెప్పవేమి?

మద–(నిరుత్తరయగును)

మోహ–(స్వ) ఇది నామాటకుమాఱుమాట జెప్పకున్నది. ఇదంతయు నేదోయొక మాయగానున్నది. ఐనను మెల్లగా లోతుదీసెదను.
(ప్ర)మదనసాయకా! నీచెలికత్తెనగు నాయొద్దనా నీదాపరము నిజముచెప్పక.

మద–దాపరమేటికి?

మోహ-దాపరములేనిచో లోపలికివెళ్ళి తారతో మాట్లాడివచ్చెదను.
మద-ఏమిమాట ?
మోహ-ఏదో యొకటి. నీ కెందులకు ?
మద-అట్లైన నిప్పుడు వీలుగాదు.
మోహ-ఇం కెప్పటికివీలు ?
మద-ఒకగంటాగితివేని
మోహ-గంటవరకు తారకు నీకును తీరియుండునుగాని నాకుతీరదు.
మద-తీరక నీ వేమిచేసెదవు ?
మోహ-ఇకచాలు సరసము. నీతో నాకేమిపని తారతోగాని.
(అని పోవగమకించును.)
మద-పోకు పోకుము. కొంచెమోర్చియుంటివేని తారయేవచ్చును.
మోహ-నేను వెళ్ళవలెనే. మదనసాయకా! లోపలికిపోనిమ్ము.
(అని గడ్డముపట్టుకొనును)
మద—సరిసరి. గుట్టుగలదాని వెల్లడి చేసుకొనుట న్యాయమా యేమి? మాట పెదవిదాటిన కోటదాటును (యోచించి)ఎద్దియైనను కార్యారంభమునకు ముందే యోచనఁజేయవలయును.
మోహ-అవును నాకుఁజెప్పుటకంతగా సంశయించెదవేల? గూఢముగా నున్నదాని వెల్లడి జేయుటకు నేనంత వెఱ్ఱిదాననా?
మద—నీవును నావలెనే గుట్టుగలదానవని యెరుంగుదును. ఐనను చెప్పుటకు సంసయమొకమూల వేధించుచున్నదే ?
మోహ-ఎందుకువేఁ? చల్లకనివచ్చి ముంత దాచుకొన్న లాభమగునా ? నిజముఁజెప్పుము. నీవు నిజముచెప్పవేని లోపలికివెళ్ళి సంగతిగ్రహించకుండ వెళ్ళను.
మద—(స్వ) ఈపీడ నిజముఁ జెప్పదనుక వదలునట్లులేదు. (యో.) చెప్పినమాత్రమేమి? [ప్ర] మోహనాంగీ! ఆలాగే చెప్పెదను గాని యీసంగతి నొరులచెవిని బడనీయనని వాగ్దానముఁ జేసెదవా ?

మోహ-యీసంగతి నాచెలికత్తెలకై ననుఁజెప్పను.
మద-నిజము? చేతిలోఁ జేయివేయుము.
మోహ-నిజము. (అని చేతిలోఁ జేయివేయును.)
(అనుబంధము 8.)
మద-సీ॥ శిరమునంటుచునుండె ♦ సరసిజారికిదార
కరకంకణాల్ ఘల్లు ♦ ఘల్లుమనఁగ
నలుగుబెట్టెఁగపోల ♦ ముల పయిఁగమ్మలు
తళతళకాంతులు ♦ దళుకులెత్త
నభిషేకమొనరించి ♦ యాతని నెఱికురుల్
దడినొత్తి చిక్కుల్ల ♦ సడలఁజేయఁ
దిరముగ గస్తూరి ♦ తిలకంబు దాఁదిద్ది
వరభూషణంబు లిం ♦ పలరఁబెట్ట
గీ॥ వేడ్క శిగకును విరజాజి ♦ విరులుజుట్ట
నతిదుకూలాంబరములు స ♦ మ్మతిగఁగట్ట
సొగసుగుల్కెడి పనుల నా ♦ సుదతిచెట్ట
డెందమునఁ జేసెనాతని ♦ ఠీకుముట్ట ॥

తార, చంద్రుని యనేకవిధంబుల నలంకరించి సరస్నానంబులు బసిండిగిన్నెలోనుంచి కరకంకణక్వాణమెసఁగునట్లు విరజాజిసురటిచే వి సరుచున్నది. వారేకాంతంబుగా నెంతెంతబనులు సేయుచూ నెదరోఁ గుట్టుగలదాని బట్టబయలు జేసితిని. యిది రాద్ధాంతముఁ జేయఁదగదు సుమీ.

మోహ-నాసంగతి నెరుంగనట్లు బల్కెదవేమి? నేనిది వెల్లడిసేయుట
కంతతప్పుదెలియని దానిననుకొంటివా?
మద-నీవు తప్పుతెలియనిదానవని చెప్పనగునా?
( తెరలో )
తార-మదనసాయకా! మదనసాయకా!
మద-ఏలనమ్మా!

తార-ఏమిచేయుచుంటివి. ఇటురమ్ము.
మద—ఇదిగో! వచ్చెద. (రహస్యముగా) మోహనాంగీ! నీవు వెళ్లుము. తారనన్ను బిల్చుచున్నది. నేను లోపలికి వెళ్ళెదను.
(నిష్క్రమించును)
తార-మదనసాయకా! పరమాన్నంబుల బంగరుపళ్ళెరమందుంచుము?
మద-ఉంచివచ్చితిని.
తార-[చూచి] పీఠికయేది?
మద-ఇదిగో. (అని లోపలికిదీసికొనిపోవును.)
తార-చంద్రా! నీవీ పీఠంబుపై గూర్చుని పరమాన్నంబుల భక్షణ సేయుము.
చంద్రు-చిత్తము.
తార-(కొంచెమూరకుండి) ఈతాంబూలంబు గ్రహింపుము. (అని చేతికిచ్చును,
చంద్రు- (తాంబూలము వేసికొనును)
తార-చంద్రా! కొంతదనుక శృంగారచేష్టల ప్రొద్దుబుచ్చుకొందమా?
చంద్రు-శృంగారచేష్టలన నెటువంటివి?
తార-ముందు నోటవచియించి పిమ్మట ననుభవముఁ జేసెదలెమ్ము.
చంద్రు-అటులనేకానిమ్ము. (అనుబంధము 9)
తార- సీ॥ కందుకక్రీడను ♦ కౌశలమతినాడ
బోదమా? యుద్యాన ♦ భూమములకును
చంద్రు- ఉద్యానవనమునకేల? నొప్పుగా నీయింట
నాడుకొందము మన ♦ మేడపైన
(కొంతసేపు బంతులాడుదురు)
తార— బంతులాడితిమింకఁ ♦ బ్రౌఢిమీరఁగ రాస
కేళులాడఁగరమ్ము ♦ మేలెరింగి
చంద్రు— రాసకేళులనేటి ♦ రాచకార్యంబింత
దనుకనాడి యెరుంగఁ ♦ దరుణినేను
తార— నీవెరుంగవేనిఁ జూపించెదలెమ్ము రాసకేళీలాడుట

గీ॥ ప్రౌఢతనము వెలయజోడు ♦ బాయకుండ
గూఢమణి నాడుకొంగమా ♦ రూఢమతిని
చంద్రు— గూఢమణియనసెట్టిద ♦ గోచరంబు
గామనంబుకు దోచె ♦ నిక్కముగదల్లీ!
గూఢమణియనిగూఢముగాబల్లుటయేగాని పిల్లియాటయేగదా?
తార—నీకు దెలియనిదేమున్నది. (పిల్లియాట యాడుదురు)
చంద్రా! ఇంకనేమి యాడుకొందము?
చంద్రు-తల్లీ! నేనాటలచే గాలయాపనం జేసితినేని చదువువ్యర్థమగును. గాన యారామమునకుబోయివచ్చి చదువుకొనియెద.
తార—ఎల్లప్పుడును నొకటేచదువు. ఎంతచదివినను అంతే. (తనలో) నామనోరథ మీడేరు సమయము సంఘటిల్లినది. యీచంద్రుని ముందు నుపవనంబున కరుగ నియమించి వెంటనే తగు ప్రయత్నముతో నేను బోయెదగాక. (ప్ర) చంద్రా! పోయిరమ్ము, (నిష్క్రమింతురు చెరియొక వైపున) (అనికజాగును)

———:o:———

[ద్వితీయ రంగము: ఉద్యానవనము]

—••o••—

[ప్రవేశము: చంద్రు.]

చంద్రు-(ఆశ్చర్యముతో) (అనుబంధము 10)
మ॥ ఘనతం బల్లవ పుష్పకేశరములం ♦ గళ్యాణ మొప్పింబిక
ధ్వనులం గన్నులం బండువై పరిమళ ♦ వ్యాప్తి న్వెలింగెన్వ సం
తుని మాహాత్మ్యముచేత, నివ్వవము నెం ♦ తో నింపుసొంపారె నీ
జనసందోహ మనీష లీలటిమహా ♦ సంతోష మయ్యెంజుమీ॥

[ప్రవేశము: తార] (ఒక వైపునుండి)

చంద్రు-(విచిత్రముగా జూచుచు, (తనలో)
గీ. కలికి! గాదిది చిలుకల కొలికి! గాని
కొలికి! గాదిది యలరుల ♦ ములికిగాని

ములికిగాదిది క్రొమ్మించు ♦ తళుకుగాని
తళుకుగాదిది జేజేల ♦ పొలతి! గాని॥

ఉ॥ కంబుగళంబు లంబుయము ♦ కంబుగజంబు నభంబుకొను చ
క్రంబుకుచద్వయంబల శు ♦ కంబువచోర రచనంబు విద్రుమా
భంబధరంబు దర్పణ ని ♦ భంబు ముఖంబుస్మితంబు చంద్రికల్
భంబునఖంబుడంబు కర ♦ భంబుల బోల్గొడలంబు జాక్షికిన్ ॥

ఆహా! యీమూడు లోకంబులలో నీ చేడెకునీడగు పూబోడినియిదివరకు చూచియుంటిమా? ముందుజూడబోవుదమా? నహ్వా! ఈ చెక్కెళ్ళ తళ్ళులు, ఈ నేత్రంబుల బెళ్ళులు, ఈమట్టియల గిల్లులు, ఈనిక్కులు, ఈసొక్కులు, ఈతక్కులు, నవ్విరించికైన నెంచవశమా? పరవశముగాని (మరల దిలకించి)

క॥ చూడక నుండగరాదీ
చేడెసొబగుఁ జూచినంతఁ జెదరును మనముల్
నేడేమిటికివ్వనిఁజెర
లాడఁ దలచివచ్చెఁ దెల్ప ♦ దప్పనినాకున్ ॥

(తార సమీపించును)

చంద్రు-(వెలవెలబోవుచు తనలో) ఆహా! నేఁడు నాపాలిటనెంతపాపిష్టిదినము. గురువుభార్యను గుర్తించనేరక నెవ్వరోయని దలంచి విరహావేశంబుచే నెన్నెన్నో వచింపదగని వాక్యంబు లీనోట వచించి యెంత పాదిత్యము సంపాదించుకొంటిని? (ప్ర) తల్లీ! నమస్కారము.

తార-ఆహా! ఇదియేమి? మనమొక వయస్కులము గదా? నాకేల నమస్కారము. (స్వ) ఈ చంద్రుండిది యనుచితమని తలంచక తల్లీ! యని బిలచి భయభక్తితో నమస్కరించు చున్నాడు. (యోచించి) నేను యోచించక ముందుగా నిది తప్పనియని యూహించితి. నేనెంత తెలివిమాలిన దానను? విటీ విటులకుఁగూడ నప్పుడప్పుడిట్టి మర్యాదలుండు టెరింగియేకాబోలు.

నీతడిట్లు చేసినది ? నేను గ్రహింపనైతిని. ఐనను ఈతని సాం గత్యము చేతనైన కొన్ని రహస్యముల గ్రహించెద. (సందియ ముతో) తల్లీ ! యని బిలచెనే ? ఏకారణముచేతఁ బిలచెనో ? (ఆకాశము దెసఁ జూచి) ఇతరులు సంశయించకుండునటుల ప గలెల్లఁ దల్లియని బిలచుచు, ప్రొద్దుగ్రుంకిన వెంటనే భార్యగా నెంచి కౌఁగిలించుకొని మరుకేళిదేలుట కాముకులనైసర్గికము గదా ? దీనికంతగా యోచించ నేల ? (ప్ర) చంద్రా ! నీకు శుభమగుగాక !

చంద్రు- క॥ ప్రకటితగతి నారామము
నకు నొంటిగవచ్చు ♦ టొప్పునా, నాకడ నీ
విక నున్న లోకులూరక
పకపక లాడుదురు ♦ గేలిబట్టుమరుబలే ॥

తల్లీ ! సద్గుణకల్పవల్లీ ! నీవీ సరణి సిగ్గువిడచి నాసరసజేరుట నీ సరివారెవ్వరేనిఁ జూచిన మోసము చేకూడును.గావున నీవిక నుట్టుగ గృహంబునకు పొమ్ము.

తార-(చిరునగవుతో)

గీ॥ వచ్చినానుర పనిగల్గి ♦ వచ్చితేమ
రేమి రా, రాజవనుచు నీ ♦ కీయ రెండు
నిమ్మపండ్లను దెచ్చితి ♦ నెమ్మిజేరఁ
బట్టి చేపట్టకను వెళ్ళ ♦ నొట్టఁదగునె ?

చంద్రా ! నేనొక్కసంగతిదెల్పెద. సది యెద్దియన దేవతల స న్నిధికిని గురువుల సన్నిధికిని రాజుల సన్నిధికిని నారీమణుల సన్నిధి కిని రిక్తహస్తములతోఁ బోవుట దగదను సామెత యెల్లవారలకుయెరు కయేగదా ?

చంద్రు-అవును.

తార—నీవు రాజవని కానుకగా నేనీ గజనిమ్మపండ్లదెచ్చితిని. యిట్టి ఘనతరంబగు గజనిమ్మపండ్లను నీమృదుకరకమలంబులంబట్టి నా

మనోభీష్టమును నెరవేర్పఁ దలంచక తిరస్కారభరంబున కరుగు
మని యతికఠినంబుగాఁ బల్కుట నీకొప్పిదమే యగును, కాని
నా దేతప్పు కాబోలు. ఆహా! నే నెంత తప్పొనరించితిని.

చంద్రు— అమ్మా!

గీ॥ తగదు తగదిక నీకింత ♦ తెగువమగువ
జగతిఁగలవార లిదివిన్న ♦ నగరె,యపయ
శంబుమగనికిగాదె, శ్రీ ♦ రంబువంటి
కులమునకు వన్నె క్రుంకదే ♦ కువలయాక్షి!

తల్లీ! సాధ్వీమతల్లీ! నీవింక నెట్టిపనిఁజేయుమన్నను నేయొప్పెదగాని యీక్రూరకృత్యమున కేనొప్పఁజాలను.

తార- మనోవల్లభా! నీవప్పల్లవాస్త్రుని కేళికి నొల్లనియెడ నేనీ మగని నొల్లను. కాపురము నొల్లను, కులమునొల్లను, మానమొల్లను చుట్టపక్కములనంతకుమున్నే యొల్లను. నాయుల్లము నీయందే జల్లుజల్లుమని పల్లవించుచున్నది. నన్నేమి చేసెదవు?

చంద్రు- అమ్మా! నీవాడినవెల్ల నొల్లనని పట్టుగాఁబట్టి జరుపుకొనుట బాడియగునుగాని నాయొద్దనుండుట యొద్దికగాదు. లేచిపొమ్ము. నాచిత్తమెరుంగక నిట్లుబల్కుట నీకుభావ్యమా? ఐనను ఇంత మాత్రమునకే నేనిట్టి కట్టడిపని కొడిగట్టి పాపమును మూటగట్టుకొందునా?

తార- మనోరమణా!

ఉ॥ నీనెరనీటు నీసొగసు ♦ నీరసికత్వము నీదుబ్రాయముం
నీనవమోహనాకృతియు ♦ నీదువిలాసము నీసుగోష్ఠియుం
మానకజూచిచూచి ♦ యభిమానముచే భ్రమదాచిదాచి నా
నేనలమారుబారికి స ♦ హించగలేను గృపన్వహించరా॥

తారాపతీ! (అనుబంధము 11)

సీ॥ నమ్మితి నీశరీ ♦ రమ్ము నమ్మితినీకు
గమ్మవిల్తుని కేళి ♦ గలయుజుమ్ము

మానరా! వగలింక ♦ నానరా! మోవి నీ
దానరా! నీపాద ♦ మానజుమ్మ
రార పూపాన్పుపైఁ ♦ జేరి మనోరథ
మారసి దీర్చుట ♦ మేరజుమ్మ
చాలురా! చలము జాగేల చేసెదవురా!
బేలను సన్వీడ ♦ మేలెజుమ్మ
గీ॥ వేవిధంబుల నను బ్రోచు ♦ వేళజుమ్మ
పరుల కంటనెబడకఁ గా ♦ పాడుజుమ్మ
గుట్టు బయలయిపోయిన ♦ రట్టు జుమ్మ
దేహియన్న నాస్తియుండిన ♦ దేనిజుమ్మ.

చంద్రు-(తొలఁగి చెవులుమూసికొని) హరిహరీ! ఈమెకా పరమేశ్వరుండు మంచితలంపు గలిగించుగాక. అమ్మా! ఈ దుర్నీతి నీకెట్లు పట్టువడెను? చాలు. చాలు. ఎంతమాటాడితివి? ఎంత క్రూర ముగ్గడించితివి? తగునా?

తార-ఓరీ! నాయింగిత మెఱుంగవై తివిగదా? నేనప్పంచశరుని నంచనల కోరువలేక నెంచరాని తమిమించి నిన్నింతగా వేడితి నే? వన్నెకాడా! నిన్ను చిన్నటనుండి పెంచి పెద్దనుఁ జేసినందుకు నిన్నుగూడుటకు నాకినుమంతయైన స్వతంత్రములేకబోయిన దే? కానిమ్ము, పంచపలవ! యీవంచనలేల? నామాటవిని యొక్కసారి నీబిగి కౌగలిమ్ము. (అని దగ్గరకుబోవును.)

చంద్రు-(దూరముపోయితనలో) నేనెన్నినీతులు బోధించినను ఈమెనా చిత్తంబెఱుంగక నానీతులం బెడచెవిని బెట్టుచున్నది. (ప్ర) తల్లీ! కన్నయింటికికొన్నయింటికి వన్నెఁ దేవలయునుగాని మున్నున్న మన్ననము సున్నజేయుపనిని దలఁపెట్టుట బాడియగునా? యోచించుకొనుము.నీవొకరిచేతఁ జెప్పించుకొనదగినదానవా?

తార-ఔరా! యేమి నీ నేర్పరితనము.

కం॥ గిరుకుసుమ మడవివెన్నెల

సరసులు, ధీరులును, లేని ♦ సభమన్నిమముగ

బురుషుండు లేనియావన

మరయగ నిష్ఫలముగాని ? యమరునె ఫలముల్ ?

చంద్రా! తడవుసేయకు. నామనవిని కానిమ్ము. సిగ్గువిడిచి నోటితోఁ జెప్పుకొనుచుంటిని. ఐనను మావంటి యువతివల మా తులవరశి రతులదేరని మీవంటి చతురుల యౌవనంబు వింత యేగదా ? నాయంతఃకరణయుంచి నీస్వాంతంబునం దా వంతసేపు యోచనసేయుము.

చంద్రు—(చెవులుమూసికొని) శివాశివా!

ఆ॥ వె॥ సరసజాక్షి! వికల ♦ చరితుఁడైననుఁ వెట్టి

వైన, మరి కురూపి ♦ యైన, ముసలి

యైన, మగఁడె దేవుఁ ♦ డని పతివ్రతలెద

నెంచు చుంద్రు గద? ప్ర ♦ పంచమందు.

అట్టి పరమధర్మంబు లోకములఁ బాతిపెట్టి పతిశాసనం బతిక్రమించుట మీబోటి పరమపతివ్రతలకుఁ బాడియగునా ?

తార—కాదుకాదు. తొగలరాయడా! నామాటవినుము. మగఁడు మగఁడనగాఁ గంటికి గంటికితగిలిన పగకాడు మగడుకాని, వృద్ధు గట్టినవాడు మగఁడగునా ? అదియుట్లుండ నీవంటి పగకాని పగ జేసికొని బ్రతుకునది మగువయగునా! అది యగచాట్లమారి ఖగముగానిఁ బాగుగ యోచించుము ?

చంద్రు—ఆహా! నీ వెంతదానవు.

తార—నీచెంతకు జేర్చుకొనవేని చింతకు లోఁబడుదాననే !

చంద్రు— గీ॥ ఏలనే మనక్లేశాటి ♦ గోలలేల ?

బేలతనమున భ్రష్టుడు ♦ చాలుచాలు

సురగురుం డిది విని నను ♦ జూచి యాగ్ర

హంబుమదిబూని శపియించు, ♦ నంబుజాక్షి ! ॥

తల్లీ! నీ వెంత క్రూరకృత్యంబున కొడిగట్టితివి ?

తార—మనోహరా! నేనుగాదు.

గీ॥ సటికి దీర్చిన బంగరు ♦ పైని ఘటిత
మైన, మణివలె వెలిగెడి ♦ యౌవనంబు
బొందువారికినే ప్రొద్దు ♦ మోహచింత
బొందుగాని వేరొక్కటి ♦ బొందగలదె?

చంద్రు-ఇట్టి విపరీత కార్యంబు దలపెట్టు టెంతయు నపయశంబని యె
ఱుంగవో?

తార—నీకిటువంటి నీతులేల? (అనుబంధము 12)

చం॥ సరసిజవైరిమారురతి ♦ సౌఖ్యముబొందుము నన్నుబ్రోవు మీ
చంద్రు-
పరులను జేరివెట్టివలెఁ ♦ బల్కెదు మన్మథబాధ కోర్వక
తార—
కరము గురుండు నిన్ను బ్రియు ♦ గాఁ గనుమన్నది నీవెరుంగవే?
చంద్రు-
హరహర! మద్గురుండిటుల ♦ నాడెనె? సందియమొందకం బళా!

తారా! ప్రియశబ్దమున కపార్థముఁజేసి చెప్పుచుంటివా!
ఔరా! వింత.

తార-అపార్థమా? సరియైన అర్థమె యిది?

చంద్రు—తల్లీ! తనమానస మెట్లుండునో లోకమంతయు నట్లేయని
తలంచుట వెల్లరకు సహజ పాండిత్యమేయగును ఐనను

గీ॥ పరుల భామామణులపయిఁ ♦ బరధనములఁ
పైని భ్రమనొందు చెనటులు ♦ బహువిధముల
నరక కూపంబులోబడి ♦ పొరలుదురని
బుధులు తెల్పంగ వినలేదె ♦ పూవుబోణి!

ఆహా! నేనీరోజు నిదుర లేచినవెంటనే నేరిమొగముఁ జూచితి
నోగాని కర్ణకఠోరంబగు వాక్యంబులు చెవులార వినవలసివచ్చెఁగదా?

తార—ప్రియా నీవు కలువలరేడవు. నేను కలువకంటిని. నీవు తారా
పతివి నేను తారను. నీవమృతాకరుడవు. నేనమృతాధరిని.

ఇట్టి సంబంధముండ నేనునీకుఁ బెరదాన నెట్ులనైతిని? నీకును నాకును చుట్టరికమిదివరకే వదలక బొదలుచున్నది. నీమది యొక్కింతదనుక యోచించి యిదినిజమైనయెడ మదనుని కదనంబున కదనిదియని గదియుటకు గర్హ్యన లేచిరమ్ము. లేదేని యిట్లనే శ్రీరంగ నీతులతోఁ గొంత ప్రొద్దుబుచ్చుము.

చంద్రు—తల్లీ!

కం॥ వలుగాకి మారుబారికి
నిలువగఁలేనట్టి నీవు నిలకడతోడన్
నిలచెదవే యముని బారికిఁ?
బలు దెఱగుల నిటుల బల్కఁ బాడియెతల్లీ.

అమ్మా! ననుగన్నదల్లికిని నీకును ఆవంతయైన బేధముండెనా? యింతిపాపకార్యముఁ జేయ సమకట్టుమని పట్టుగాఁ బల్కుట కెట్లుబుద్ధి బొడమెను? ఐనను నన్నిట్లు జేయుమనుట నీకు న్యాయమా? యీ మాటవిన్నవారెల్లరు నన్ను సీ! యని చీవాట్లుబెట్టరా? నీవిట్లధర్మమును బూని యభిమానమువీడి మోహపాశమునకులోబడిపల్కుట బాడిగాదుసుమీ? నీవు తప్పుదెలియనిదానవా?

తార-ఔను! కాకిముక్కునకు దొండపండు గట్టినట్లు నావంటి యౌవనాంగికా శతవృద్ధు లభించినందుకు నాచిత్తమెంతసంతాపము నొందుచున్నదో నీవే కాసంత సేపు యోచించుము?

చంద్రు-తల్లీ! యిట్టిబుద్ధులతి దూష్యంబులని యెరుంగవో? నీకు దెలియనిదెద్దిగలదు? నీవిట్టి చెడుబుద్ధిబూనుట యెంతతప్పు? ఎంత సాహసము? ప్రాణంబు లస్థిరంబులగునపుడు కాయంబులు స్థిరంబులా? యీనాల్గు దినంబులు మర్యాదగా జీవించిదాటిపోవుట కీర్తిగాని? (అనుబంధము 13.)

తార—చంద్రా!

సీ. ఖ్యాతిగా శ్రీరంగ ♦ నీతులు చెప్పెద
వేల? నాతో రతి ♦ దేలరాదె?

కన్నపుత్రిక యని ♦ యెన్నక వాణిని
గూడు వాక్పతి కది ♦ గూడదని రె?
దాశ కన్యాకేళి ♦ తప్పుగా నెంచి ప
రాశరముని వెలి ♦ జేసినారె?
మేనక సంబంధ ♦ మూనిన యగ్గాధి
సూనుని కులములో ♦ హీనుడని రె?
గౌతమిసతిపొందు ♦ గాంతుఁ జెందిన నింద్రు
స్వారాజ్య మేలనీ ♦ రైరె సురలు?
మేనత్త రాధతో ♦ మెలఁగెడి కృష్ణున
కిది దూష్యమని యెవ్వ రేనియనిరె?
గీ॥ వారికన్నను నీపరిభా ♦ వంబు ఘనమె?
మున్ను మునులంతవారలు ♦ ముదితలిండ్ల
సేవకులుగారె, యీరిత్తభావమేల?
నాకుగాఁ గల్గెనా నీకు ♦ పోకలెల్ల.

నిర్దయుడా! దిరిశన పువ్వుకన్న మృదుతరంబగు గాత్రంబునకు వజ్రమువలె నతి కఠినచిత్తము దాపరించినందుకు నా స్వాంతంబెంత సంతాపబడుచున్నదో మీబోంట్లకేమి తెలియును,

చంద్రు—(స్వ) ఆహా! యేమియీవిఁత. (ప్ర)

క॥ ఈపాండిత్యము నెక్కడఁ
జేపట్టితొగాని దీనఁ జేటగునింక౯
బాపసమీహితమగు రతి
యే పుణ్యంబనెద వెంత యుచ్చకమమ్మా!

మేలుమేలు నీవంటి చదువరిని యింతవరకు నాగన్నులతో కని యెరుంగను. ఐనను మీవంశపరంపర మోక్షమార్గమునకిట్టి పనులే యాధారముకాబోలును? నాకొకరితో సాటియా? అది యటుండ పరసతీరత్నంబుకన్న పాపంబు వేరొకటి కద్దా? మనమొరుల కంట బడకుండ నీపాపంబు జేయగలముగాని దైవము కంటబడకుండఁ జేయఁ

గలమా? చాలుచాలు, నేనిట్టి యధర్మకృత్యంబులుసలిపి పలువురిచే దూషింపబడి పాపమును మూటగట్టుకొని మోయఁజాలను.

తార-ఓరీ! సంభోగజ్ఞానహీనుఁడా!

చంద్రు—ఏమీ ఇంతీ! నన్నెంతమాటంటివి? అనిననేమిలే.

తార—(చిరునగవుతో) మనోహరా! దరహాసచంద్రికచే నీమన శ్శశికాంతామణిని వెన్నవలె గరఁగఁజేసి నాకున్న ఖిన్నతను వె న్నుదన్నువరకు నిన్నెన్నిమాటలన్నను గన్నులు మూసికొని నా కన్నులయెదుట నూరక వదరకనైన నుండుము.

చంద్రు—వనజాక్షీ! నీవనదలచిన వెల్ల నొక్కటియైన బీరుపోనీక యని యాఘనంబు నీవేయనుభవించుము. ఇంతమాత్రమునకే నాఘనతకు ముప్పురానేరదు. నీవు గురుసతి వగుటచే నీవన వచ్చును. నేనుఁ బడవచ్చును. తప్పుగాదు.

(అనుబంధము 14)

తార-సీ॥ కలహమేలర కనుల్ ♦ గల్గినందుకు గాంచ
వలసిన నీరూపు ♦ వలచిగంటి
వలపులు నిలుపలేను ♦ తళుకుచెక్కులముద్దు
లిమ్మకొమ్మటని మరీ ♦ యడుగుచుంటి
మొలక నవ్వులముద్దు ♦ గులుకుచు నొకమాట
కిలకిలలాడుచు ♦ బలుకుమంటి
అల కృష్ణుడా బృందఁ ♦ గలసి సుఖించిన
ట్టుల, నీవు ననుగూడఁ ♦ గలయుమంటి
గీ. చాలుచాలింపు మీనీతు ♦ లేలనంటి
నడరు గ్రీష్మంగఁ దత్తర ♦ పడుచునుంటి
సమ్మతిగ నొక్కసారి కా ♦ నిమ్మటంటి
కోర్కెదీర్చితో మఱిమఱి ♦ కొసరనంటి.

చంద్రు-(తలవంచి నిరుత్తరుఁడగును)

తార—(స్వ) ఇంక నీసరసహీనుని వేడదగదు. నా యిచ్చవచ్చినట్లు దూలనాడి చూచెదను.

(ప్ర) కాంతా!

గీ॥ నీదు శృంగారమును నెర ♦ నీటుగాంచి
భ్రాంతి నొందితి నీవింత ♦ బంటవనుచుఁ
గాననైతిని, మగరూప ♦ మూనినట్టి
బొమ్మనని తోచనేర ♦ నిర్మోహియిపుడు.

కఠినుఁడా! నీవనంగుఁడవైన మాబోటి కాంతారత్నంబుల కిసుమంతయైన జింత సంఘటిల్లదుగదా? నీవెంతవాఁడవురా! (స్వ) వీని నెంతో ఘనముగా వేడ సంతోషమును దూషించుటచే రోషము నులేక మానస విహీనమగు రాతి బొమ్మనలెఁ జూడనొప్పెను. మీద జేయవలసినదేమి? బెదరించికూడ చూచెదను. (ప) ఓరీ! నామాట విననైతివా? నీగురువు వచ్చినతరువాత నీపనుపాట్లుచూతుము.

చంద్రు—నేనికార్య మధర్మమని యొప్పనైతిని. యీ సంగతినెల్ల మద్గురూత్తమునకు నీవు విన్నవించినంతనే యమ్మహాత్ముఁడు నమ్మునా? యమ్మహాత్ముడు నమ్మినను నాదైవము నమ్మ వద్దా? కానిమ్ము.

తార—ఓరీ! పాయసంబుకన్న ప్రాణంబు తీపియనునది యెఱుంగవా?

చంద్రు—ఎరుగకనేమి? నాకు ధర్మహానికన్న ప్రాణహాని యెక్కుడు కాదు. నేనిక పాఠశాలకేగెద.

చంద్రు—ఔనా! పోయెదవా? స్త్రీలు సాహసింపఁ దొడఁగెనా జేయ నికార్యమేలేదు. నాకున్న బాళియంతయు వెలిబుచ్చితిని పొమ్ము.

(తలనూపును) (చంద్రుడు నిష్క్రమించును.)

(ద్వితీయరంగము:ఉద్యానము.)

[ప్రవేశము:తార-మదనసాయక]

తార—(స్వ) నామనోహరుండు కంటికి కరవైనవెంటనే మదనుండదయుండై యదనిదియని పదునుగలబాణంబులచే నా యెద బగు

లునట్లు కొట్టుచుండెనే. నాకేదియుఁ దోచకున్నది. నేనిమి సేయుదును?

మద—అమ్మా! నీవింతగా చింతిల్లకు మనమా మన్మథుని కరుణకుదగిన నవారము. ఒక్కింతదయారసంబుంచి రక్షించుమని కొనియాడితివేని యాతండు మనఃకాఠిన్యము దొరంగక కంఠముఁ గత్తిరించు నామేమి?

తార—అన్నును. (అనుబంధము 15)

చ॥ మరుఁడ! మొరాలకించు సుమ ♦ మార్గణ బాధలకోర్వలేక నే
శరణనియంటి, నన్విడచి ♦ చయ్యన బొమ్మటు పోకయున్న మ
మ్మిరుపుర రెండుగన్నులు గ ♦ నిష్టముగాఁ గని పుష్పబాణముల్
బరపుటధర్మ మార్గమగు ♦ బాడియెనన్నొకదాని నేచుటల్॥

గీ॥ హరిహరాదుల కైనను ♦ సరకుగొనని
ధీరుఁడవు నీవు, సతులెంతవారు ♦ కినుక
మాను, పిచ్చుకపై బ్రహ్మ ♦ బాణమండ్రు
బాలలోస్తురె నీయట్టి ♦ ప్రౌఢగతికి.

(కోపముతో) కం॥ వనితల నేచుట ఘనమా?
వినుమా నిన్నేమనందు ♦ వేడుకతోడన్
గొనియాడిన గలమించుక
యును లేకన్నోర్వ యెగదర ♦ యోరీ ద్రోహీ!

కఠినుఁడా! నిన్నెంత వేడుకొన్నను కాసంతయైన దురంతంబు సంతంబునొందించవైతివి. నిన్నేమని కొనియాడుదు? నెంతనిదూషింతు?

కం॥ దోసమటంచని యెన్నక
భాసురముగ సతులఁబట్టి ♦ బాధించెడిని
న్నాసిలిగఁజేసి, రూపము
నాశము జేయంగరైరి ♦ నాకసిదీరన్॥

దుర్మతీ! పాపముదలంచక మావంటి పాంథులఁ బట్టి బాధించెడి నీ రూపము నేపుణ్యుఁడైన మాపిన పిమ్మటగాని వధూవరుల కష్ట

ములన నెట్టివో యెరుంగక హాయిగ నుందురు.

తే॥ చపలచిత్తుఁడ ♦ చెడు పిశాచములరీతిఁ
జెట్లపాలై నకడుబంట్లఁ జేర్చుకొనిన
చెడుగవా నీవు పాంథుల ♦ జేరి బాధఁ
బెట్టకుందువె పలుగాకి ! చెట్టవగుచు ॥

తుంటరీ ! మంటలో బడుమిడుతకై వడి యమ్ముక్కుంటి కంటి మంటచే నడుగంటి మంటిపాల్గాక మావంటి వాల్గంటుల నేడ్పించుట కుంటివా ? (చెట్లదెసఁజూచుచు)

తే॥ కోకిలామావిచిగురుల ♦ క్రొవ్వుదలకు
నెక్కెనటే, లేకయున్న నీ ♦ నిక్కులేల ?
నీకుదోడుగ నాపలు ♦ గాకి చిలుక
లగ్గువగఁ గూయసాగె నే ♦ సిగ్గువిడచి.

క॥ అల మధుపానులకును బలు
చులకని గుణములగుఁగాని ♦ సుగుణముగలదె ?
యళులార ! గనుకనే మి
మ్ములఁ సంపఁగి జేరనీయదు మోదముమీరన్॥

సఖి ! మనమివ్వనంబునందుండి యేమి సుఖ మనుభవింపను ? మెల్లమెల్లగా గృహంబున కేగితిమేని కొంతవరకు మేలుగానుండు.

మద--అవును నిజమే. (ఇరువురు నిష్క్రమింతురు.) (అవనికజారును)

—••o••—

తృతీయరంగము పాఠశాలాగృహము.

———:o:———

[ప్రవేశము:చంద్రుడు ]

చంద్రు—(స్వ) ఆహా ! స్త్రీలెంత సాహసులు. నేనధర్మమున కొప్ప
నని గట్టిగా జెప్ప నత్తారాసతి కోపముఁ దెచ్చుకొని మీగురు
వుగారు వచ్చినపిదప నీపనుపాట్లు జూడు"మని స్ఫుటముగాఁ బ
ల్కినదే? అక్కటా ! అగ్గురూత్తముం డరుదెంచినవెంటనే

యాతరుణీమణి కలవి లేనివికల్పించి చెప్పి సన్నిమి జేయించునో గదా? (యోచించి) యిప్పుడే నాకొక యూహ బొడమినది గురువరుండు గృహంబు జేరకమున్నే నేనచ్చటికేగి యాసరసి జాక్షిని నాస్వాధీనంబు జేసికొని ప్రాణంబునిలుపుకొనియెదగాక.

———:o:———

## చతుర్థరంగము—తారఅంతిపురము

[ ప్రవేశము: చంద్రుఁడు. ]

———:o:———

చంద్రు—తారా! తారా! తల్పుదీయుము.

తార—తల్పు. నీవెవ్వఁడవు?

చంద్రు—నేనుచంద్రుఁడను.

తార—ఐననేమి?

చంద్రు—ఏమిలేదు, తల్పుదీయుము. నీపుణ్యముగాని.

తార-పుణ్యములేదు, పాపములేదు. తల్పుతీయుటకిది సమయముగాదు పొమ్ము. నీతోఁగావలసినదేమి?

చంద్రు- (అనుబంధము 16.)

సీ॥ తల్పుదీయుటకేల ♦ తడవుజేసెదుతార
నిలచియుండగలేను ♦ నిమిషమైన

తార- తల్పుగడియదీసి ♦ యిలుజొరనిచ్చిన
యలివేణులపహాస్య ♦ మాడరటర

చంద్రు-ఈలాగురిత్తగా ♦ కాలయాపనసేయ
నేలాగు, తాళుదు ♦ నే లతాంగి

తార- చాలు చాల్పోర నీ ♦ సరసము దెలసె నీ
యాలోచనలు సేయు ♦ టాడికలెర

చంద్రు— గీ॥ అక్కటా! కఠినముబూని ♦ యన్యరీతిఁ
జిక్కులిటుబెట్టి చేసెదా ♦ చెల్లపాలు

తార— ఔర ! మిణిమీరి వెక్కస ♦ మాడుకెల్లఁ
జూడ, నేనక్కరగలట్టి ♦ జాడలేదె?

చంద్రు-తారా! నీవునాకక్కరగల్గియే యుంటివిగాని నేను నీకక్కర బట్టినట్టులేదు.

తార-నిజమేపో.

చంద్రు-అబద్ధమా?

తార-అటులైన తల్పుదీయుచుంటిని. (అని తల్పుదీయును)

చంద్రు-(యెందరగా) (అనుబంధము 17)

ఉ॥ తాళఁగఁజాల వందనము ♦ దాకొని జేసెదనో! లతాంగి! జా
గేలనె మేలిమోవి సుధ ♦ నీయెడఁ గ్రోలఁగ నీక నేరముల్
జాలగ నెన్నితో మరుని ♦ సాయకధార పరంపరల్వెసన్
గ్రాలుచువచ్చి నన్గదసి ♦ కారియబెట్టుచు జంపబూనవే॥

సీ॥ మదిరాయతాక్షి! నీ♦ మది రాయిజేయుట
మర్యాదగాదు నా ♦ మాట వినవె
యెదురాగ్రహము మాను ♦ మెదురాడగాఁజాల
నదిగాకఁ దలదాకె ♦ నంబుజాక్షి!
నీదు మానసమును ♦ నే గాంచగాఁగోరి
వాదించితిని రిత్త ♦ వాదమిదియ
కాంతరో! నీబిగి ♦ కౌఁగిలి నాకిచ్చి
సంతాపమార్చిన ♦ సంతసముగ

గీ॥ అతివ! మీదట నీమాట ♦ నడుగుదాట
నమ్మునామాట యీతప్పు ♦ నడతగోటఁ
జిమ్మితోయిట ప్రాణ ధ ♦ నమ్ము మాట
గట్టిదాఁచుటగాదె, మో ♦ క్షమ్ముబాట.

తార—నీమాటలను నిన్నను నమ్మినట్లే యున్నది.

చంద్రు—నీ వెన్ని మాటలన్ననునాకిష్టమేయగు.

తార- కం॥ పురుషుల పలుకులు నమ్మిక

థర నక్కరదీరు నంత ♦ దనుక నెగోదా ?
అణుదు గదలిన సిగయును
సరవిని మఱిదగులకున్నఁ ♦ జరణమగుబలే॥

చంద్రు—ఇట్టి మాటలననేల ? నెమ్మదిగానామనఃపరిశీలనఁజేయరాదా ? నిదియుంకుండ

ఆ॥ వె॥ నెనరులేనిపొందు ♦ నిద్రకుచేటగు
భక్తిలేనిపూజ ♦ పత్రిచేటు
మనసుదగుల నపుడు ♦ మమతకుచేటను
సామ్యమెరుఁగ వటవె ♦ సారసాక్షి ।

తార—ఎఱింగిననేమి ?

చంద్రు—నీకుఁ దెలియనిదేమున్నది?

తార— గీ॥ రమణుఁడా నీకు నింత యూ ♦ రాటమేల ?
పిల్లి కనుమూసి పాల్ద్రావు ♦ బెల్లవార
లెరుఁగరే ? సంగవలెవచ్చి ♦ యిపుడుమరల
వగలబన్నిన ఫలపోమి ♦ పొగలరాయు !

వన్నెకాడా ! యీవగలింతకు మున్నెక్కడబోయెనో ?

చంద్రు—తన్వీ ! గీ॥ మున్ను బల్కిన నాపల్కు ♦ లన్నినిల్పి
నన్నుమన్నించి రతి నేలు ♦ సన్నుతాంగి !
బోటి ! నీమాటకును జవ ♦ దాటననుచు
బాసఁ జేసెద, నీదుపై ♦ నాసచేత ॥

తార-మదనమోహనా ! మనకు బాసలతో నేమిపని ? మదనుని కేళికిది మంచిసమయమురమ్ము.

చంద్రు—(తారచేయిబట్టుకొని)

శా॥ రావే పన్నగవేణి ! కుందరదనా ! ♦ రావే సరోజేక్షణా !
రావే పూర్ణిమచంద్రమండలముఖీ ! రావే ఠోరస్తనీ !
రావే చిల్కలకొల్కి ! కల్కి ! యిటవే ♦ రావే జగన్మోహినీ !
రావే నీబిగి కౌఁగిలిచ్చి ! కృపమీా ♦ రం బోవవే మ్రొక్కెదన్.

చంచలాక్షీ! యెంచరాని తమిమించిన నావంటి దీనునిపై నే టికి దయారసముఁగల్గి పంచశరుకేళి నేల దలంచినందుకు నామది సంత సించినది. మన మిర్వురమిక బూపాన్పునందు చిత్రవిచిత్రమగురతుల నతులగతులఁ బెనగులాడుదము రమ్ము.

తార — నాతలంపుగూడ నింతకు మూడురెట్లెక్కుడుతొందరగల్గియే యు న్నది. ఇంక నూరకఁ గాలయాపన జేయకరమ్ము.

చంద్రు — కాలయాపనతోఁబనియేల? పోవుదమురమ్ము.

(నిష్క్రమింతురు.) అవనిక జారును.

తృతీయాంకము సంపూర్ణము.






శ్రీ

# తారాచంద్రీయము

## చతుర్థాంకము

( ప్రథమరంగము:బృహస్పతిగృహము. )

[ ప్రవేశము:బృహస్పతి, వికటచతురుఁడు. ]

బృహ-వికటచతురా!

విక—ఏమి స్వామి!

బృహ-ఏమిలేదు. మీయమ్మ యెక్కడనున్నది?

విక—అయ్యా! మనయమ్మనడుగుచున్నారా! చూచిచెప్పెదనుండుఁడి

బృహ-ఓరీ! నీకమ్మయైతే నాకును అమ్మయేయగునా?

విక—అయ్యా! నేనెరుంగక జెప్పితి. మనభార్యనుఁజూచి చెప్పెదనుండండి.

బృహ—ఓరి పలుగాకి! నాకుభార్యయైతే! నీకును భార్యయేనా?

విక—అటులైన నీభార్య నాకేమిగావలయును?

బృహ-నీకు అమ్మగావలయు.

విక—మాయమ్మ మీకేమి గావలయును?

బృహ-నాకుభార్య.

విక—మీరయ్యవారైనప్పటికి యీతూరి యీమాట నంటిరేని శిగకు త్రాడుగట్టి యింటి దూలమునకు వ్రేలాడదీసెదను.

బృహ-ఛీ! భ్రష్టా! ఊరక వ్రేలక శృంగారవతితార యెక్కడ నున్నదో చూచిచెప్పుము?

విక—ఆ. నేనొక మనవిఁ జేసికొనియెద.

బృహ-ఏమది?

వికట— కం॥ గురువర మీరిలు వెలువడి
పురుహూతుని కడకుజనిన ♦ ప్రొద్దాదిగ నీ
వరకు మన తార మొగమే
నిరువుగఁ గని యెరుఁగ మీర ♦ లిప్పుడు గనుఁడీ.

ఇకమీరు దివ్యదృష్టిని గనుఁగొనవచ్చును?

బృహ-మంచిది. గనుఁగొనియెద. (యోచించును)

[ ప్రవేశము: తార కనక కలశంబులతో జలంబులుగొని ]

తార-నాథా! మీపాదకమలంబు లిందుంచితిరేని శుద్ధి జేసెదను.

బృహ-మంచిది. (పాదంబులుకడిగియజ్జలంబులుశిరముపైఁజల్లుకొనును)

తార-(స్వ) నాపూర్వపుణ్యంబుచే సారంగధరునిపొందు సంప్రాప్తమై నది. ఇక నీ ముసలివానితో గావలసినదేమి? ఆహా! నేనెం తపొరబడితిని. మగనిదూషించుట మగువలకు దగవుగాదు. ఏ నను కొంతదనుక నిట్లే కపటచేష్టలతోఁ గాలము వెళ్ళదీసెద ను. (ప్ర) నాథా!

ద్విపద.

అంచితంబుగనింద్రు ♦ యజ్ఞంబు నిర్వ
హించితిరే, సుఖ ♦ మే మీకుమరియు
నతనిచే బహుమతు ♦ లందివచ్చితిరె?
హితమతి నిన్ని నా ♦ ళ్ళింటనొంటిరిగ
నన్నుంచి యెటునుం ♦ డగ మనసొప్పె
సన్నుతగతిఁదెల్పు? ♦ సదమలచరిత.

మీసాధ్వి యింటియందింతవరకు సుఖముగా నుండియున్నదను తలంపుగల్గియేగాబోలు మీరింత తొందరగా విజయముచేయుటలు.

(దీనత్వముజూపును)

బృహ-తారా! ఊరడిలుము. విపరీతములాడకుము. నీయాజ్ఞదాటక వేగముగనే వచ్చితినిగదా. (స్వ) ఇవ్వన్నెలాడి యింటియం దొంటరిగానుంచిపోయిన కారణంబుచే నాపతి యింతరాతిగుం

డెగలవాఁడు గదాయని తలంచి రిక్తభావంబుచే యిట్లు బల్కుచు న్నది కానిమ్ము. (ప్ర) మదగజగమనా! నీవీసమయంబున భయపడక పరమానందంబుగా నుంటివా?

తార—ఆ. మీరచ్చట నెంతసుఖముగా నుంటిరో నేనిచ్చట నంతగానే యుంటిని.

బృహ—నేనచ్చట నెంతో సుఖముగనే యుంటి నైనను లాభమరవీస మంతయును లేదు.

తార—ఎందుచేత?

బృహ—నీకు దెలియదా?

తార-నేనంత దెలివి యేసంపాదించితినైన మీపొందు భాయనోముదునా?

బృహ—తారా! మిగిలినది యేమి? నేనును నిన్నుగాంచు భాగ్య మెప్పుడోయని కలవరించుచుంటిని.

తార-అవును మీరిచ్చటకు విచ్చేసియు మాటలచే గాలము వెళ్ళ బుచ్చుట నట్లనేయున్నది. మీరచ్చటి పనులనెల్ల నెరవేర్చివచ్చితిరా? తిరుగ వెళ్ళవలెనా?

బృహ-పనిలేదు.

గీ॥ క్రతువుజేయించి యద్దేవ ♦ పతినయముగ
నొసగు మణిభూషణాదుల ♦ నొప్పిదముగ
గొంటి సుఖముంటి నొక్కంట ♦ కొరంతలేదు
కాంత! నీపొందులేని కొ ♦ అంతదక్క॥

తారా! నే నేయుమక్క కార్యంబులెల్లఁ జేయుచు సంతోషముతో నీయింట నుంటివిగదా?

తార—భగవదనుగ్రహముచే మీరలు బాసిపోయినది మొదలు మీయనుమతి నతిక్రమించక నెంతో సంతోషముతో నుంటిగాని నొక్క కొరంతతో.

బృహ—నీకేమి కొరంత?

తార—మీ కొరంతయేఁటిదే నాకొరంతయు.

బృహ-ఆ కామభోగవానుడు మనల నేకీభవింపఁ జేసె. నింకనేమి కొ
రంతగలదు ?

తార—అవును (స్వగ) ఊరుపొమ్మన కాదురోయి ముసలి వా
నికే యింత భ్రమయుండెనే? నాకెంతయుండవచ్చును? దైవ
మా! నేనేమిసేయుదు? నేనా చంద్రునితో బద్ధానురాగనై
యిట్లే కపట చేష్టలతో నమ్మిక చెడకుండునట్లు కొంతదనుక
నటించెదను. (తార లోనికిబోవును.)

[ ప్రవేశము:చంద్రుఁడు ]

చంద్రు—ఆచార్యా! వందనములు.

బృహ—శుభమగుగాక. చంద్రా!

కం॥ ఎంతయు శాస్త్రాదుల బహు
చింతన గావించినావె? ♦ శృంగారపు నా
యింతి నిను బ్రోచుచుండెనె?
సంతసమున నగ్నులన్ని ♦ చారించెదవే? ॥

చంద్రా! మాతార"తనకుమారునిరీతి" నిన్నుబరిపోషణజేసినదా?

చంద్రు-అయ్యా! మీావన్నెలాడి నన్నన్ని విధంబులఁ దిన్నగానే పో
షించినది. నేను సకల శాస్త్రంబులు బఠింపుచు సుఖగోష్టి చే
యుచు నతికామముతో గ్రీడించుచుంటిని.

బృహ—మంచిది. సంతసించితిని. (అవనికజారును)

———:o:———

(ద్వితీయరంగము:బృహస్పతిగృహము)

—••o••—

[ ప్రవేశము:తార, బృహస్పతి. ]

బృహ-(కోపముతోఁదారనుబట్టుకొని)ఓసీ! మోసకారీ! యెంతదానవే!
(అనుబంధము 18.)

ఉ॥ వాసవుఁడాదిగాఁ సుర ♦ వశ్యులలోఁదగువాసినన్నెన
న్బాసెనె, సాహసీ! కులటా! ♦ నాతిగఁజేసిన పాపుడెంత వాఁ

డీసరి నీవచించినవి ♦ యెల్ల నిజంబని మోసబోతినే?
నీసరిబోంట్ల నక్కమల ♦ నేత్రుఁడు బట్టుకఁదాట వల్వడే! ॥

గద్దరిముద్దియా! పెద్దలులేని సమయమందు నొద్దికగా మిమ్ము నద్దర నింటనుంచి పోవుటచే నాపెద్దతనము మొద్దులయి పోవుటయగాక నాబుద్ధి పెడతలఁబట్టినది. యిందుకేమి చెప్పెదవు?

తార—(తలవంచి నిరుత్తరయగును.)

బృహ—కం॥ చంచలగాత్రి! శిరంబును
వంచెదు, తలవంపుమాకు ♦ వచ్చెను బిత్తరీ
వంచనగా జదువులఁ జదివి జ
యించితినని విధుఁడు కుటిలుఁ ♦ డెదనిటు బన్నెన్॥

మీకపటచేష్టలుదాగుననుకొంటిరిగాబోలు? అవిదాగునవికావు.

గీ॥ అతివ మీనడవడినెల్ల ♦ నరశిదివ్య
దృష్టిచే గాంచినాడ వి ♦ స్పష్టముగను
ముందు మీలోనఁజెనకిన ♦ మూఢచిత్తు
లెవ్వరో చెల్పు? శిక్షింతు ♦ నెక్కుడుగను॥

ఇమ్మహిస్థలియందిమ్మగువలమాటనమ్మ జనమ్ముల మనమ్ము లెంత తెలివిమాలినవి? నేనును మీచరిత్రమెల్ల దివ్యమ్ముగఁ గన్నుదమ్ములఁగంటి. నెమ్మదిగా నిజమ్ము చెల్పుము?

తార—(నిరుత్తరయగును)

బృహ—చెప్పటకిష్టము లేకనాయేమి తలవంచుకొనుట?

తార-(స్వ) ఇమ్మునిలివాఁడు సామాన్యుఁడుగాఁడు. నిజమును దీసెనే? నేనేమని బొంకుదును? ఇంకమీద నాబొంకులుసాగవు? అయినను నామాటను నమ్మజాలడు. నమ్మకున్ననేమి? (ప్ర) నాథా! నేనబద్ధమాడను. అమ్మునికుమారుని చిన్నటనుంచి పెంచి పెద్దనుజేసిన స్వాతంత్రముచేఁ గలసిమెలసి యుండుటే గాని యింతకువిన నేనేమియు యెఱుంగను. మీసాక్షిగ పైన మీచిత్తము.

బృహ—నీవేమియు నెరుంగవా ?
తార—(నిరుత్తరయగును)
బృహ—ఏమి నిరుత్తరంబంగీకార సూచకంబుగాదా ?
తార—కాదుకాదు. నేనే పరమ పతివ్రతనగుటచే మీమాటకెదురు బల్క దోషమెుదవునని యూరకుంటిని. అదియును మీసంశయంబునకు సహాయముగ నూతయిచ్చినది. నిజము నిల్కడ మీదఁ దెలియదా ? ఇంతయేల ?

(అని కన్నీరు గార్చుచు బొటనవ్రేలు నేల వ్రాయుచు)

సీ. ఏమనియుత్తరం ♦ బేనీయగలదాన
మామాట నమ్మక ♦ మా దలంప
నెందునదీరు మీ ♦ కీ సందియంబింకఁ
గ్రందుగా నాపయిఁ ♦ గనికరమెటు
గలుగును, మీకు ని ♦ క్కము గల్గకుండిన
నిలనాదు జన్మ మిం ♦ కేల మనలఁ
బాపపువిధియెడ ♦ బాపఁగామది నెంచి
ప్రాపుమీరంగ నీ ♦ పక్కఁబన్ని
గీ॥ తలనువ్రాసిన యాబ్రాలు ♦ తప్పబోనె ?
వికటముగ మీరలీవేళ ♦ విచ్చలవిడి
తప్పుజేసిన వారిపైఁ ♦ దామసించి
దండనముజేతుమని రిది ♦ ధర్మమౌనె?

తమ్మికంటి యగు యహల్య తమకంబుచేత నమరపతితోఁ గలయదా ? యదియొక తప్పుజేయుటగాదా ? యీధరిత్రీవలయంబుపైఁ దప్పుజేయనివారెవ్వరుగలరు ? ఐనను అబముసుబంబనునది యెరుంగని మాబోటి యబలలు తప్పుజేసినను మీబోటి ప్రౌఢులోర్చ వలయునుగాని యిట్లాగ్రహంబుబూని చర్చజేసి నల్గురిలో నన్నల్లరి జేసి తిరిగదా ? హా నాథా ! యీహీనపు బ్రతుకునాకేల.

(పాదంబులపైఁబడి నేడ్చును)

బృహ—తారా! లేలెమ్మా. నీవంటి కర్పూరగంధిలభ్యంబగుట నబ్బిం బగుటచే నిది ప్రథమాపరాధంబుగా నెంచి మన్నించితి. ఇక మీాద నిట్టి తుచ్ఛబుద్ధి దిద్దుకొని యొద్దికగా నంతఃపురంబు నం దుండుము. పొమ్మా.

తార—(స్వ) నేను దుర్మార్గమునకు లోబడియు సన్మార్గురాలివలె నటించుటచే మాయిర్వురయందును దొల్లింటివలె నమ్మకము గలుగజేసితిని. మీాద నేనేదిచెప్పినను అది యామదుసలి విని తీరును. ఇక భయము రానేరదు? నేనా చంద్రునితో గలసి మెలసి సుఖముగా నుండ నోమితిని. (నిష్క్రమించును.)

బృహ—వికటచతురా! చంద్రుని యిచ్చటికి దోడ్కొనిరమ్మా?

విక—ఇదే తోడివచ్చెద. (నిష్క్రమించును)

[ పునఃప్రవేశము వికటచతురుఁడు చంద్రునితో ]

చంద్రు—గురువరా! నమస్కారము.

బృహ—(కోపముతో) ఓరీ! గురుద్రోహీ! ఖలమతీ!

గీ॥ చిరుతబాలురు నీవలె ♦ సేయఁగలరె?
నీదుభక్తికి నామది ♦ మోదమందెఁ
జదివినాడవు సకల శాస్త్రంబులెల్లఁ
బెక్కునాళ్ళాయె నిటవచ్చి ♦ నిక్కువముగఁ
దల్లిదండ్రులఁగనఁ జను ♦ తారకేశ!

చంద్రు—శలవొసంగితిరేని పోయివచ్చెద.

బృహ—పదపద నీభక్తికి మెచ్చితి. నిఁక జాగుసేయకతరలిపొమ్మా.

(బృహస్పతి నిష్క్రమించును)

చంద్రు—(స్వ)

సీ. అక్కటా యాసుంద ♦ రాంగి పొందెడఁబాయ
జేసిన విధిజేతఁ ♦ జెప్పదరమె
చిత్తజుబారికి ♦ జిక్కిసొక్కితి నడు
గిడలేని వాఁడనై ♦ తిప్పుడిందు

సాల, రసాల; త ♦ మాల, హింతాల, మా
లూర, ఖర్జూర ♦ జంబీర, వకుళ
మందార, కుంద మా ♦ కంద, చందనవృక్ష,
బృందాన్వితంబయి ♦ పిక, శుకాళి
గీ॥ శారికాకీరకలకంఠ ♦ సంగతంబు
నగుచు వాసంతికోత్సవంబై సయట్టి
గొప్పయారామసీమను ♦ కుంజగర్భ
మందునేనుందు గొన్ని నా ♦ కృతివ కొరకు॥

హా! తారా! నీశృంగారచేష్టల నెన్ని విధంబుల మరువజూచి నను గన్నుల గట్టినట్లుండుకతంబున మరపునకు రాకున్నవి? నాకంట బడు సర్వంబును నీవుగాఁ దలంపుచుంటినిగదా?

(అనుబంధము 19)

ఉ॥ ఆవనజాక్షి గబ్బిచను ♦ లా సుకుమారి శిరోజ సంచయం
బావగలాడి మోవి రుచు ♦ లాచెలి తళ్కు మిటారిచూపు మీ
లావనితా శిరోమణి న ♦ యప్రణయాభినయప్రియోక్తులా
హా! వనజోదరుండు చతు ♦ రాస్యతఁజూపిన నెన్న నేర్తునే?

ద్విపద.

కలకండములును, శ ♦ ర్కరయమృతంబు
వలజుంటి తేనెయు ♦ నరఁటిఫలములు
క్షీరాన్నమును నారి ♦ కేళంబులోని
నీరు పానకమును ♦ నేటగుగుడము
కమలాఫలములాది ♦ గాఁ గలవన్ని
కమలాక్షి మోవితో ♦ గలనైనసాటి
రానట్టి యామోవి ♦ రా జిల్కరీతి
గా వేగనొక్కెదు ♦ కలువరమతిని
కం॥ ఆచెలినేర్పులు! మహిమలు
వాచాలతవగలనెంచ ♦ వశమౌనా? నా

లోచనములకా తారగఁ
దోచినవిధిఁ దొరలసాగె ♦ దొల్లిటివలెనే.
తే॥ ఇందుబింబాస్య నేను నీ ♦ పొందుబాసి
యెందుబోత్తునే యిపుడు నీ ♦ యందమైన
పాదములచెంత నలగుల ♦ పాన్పుపైని
యోర కాసంతచోటిచ్చి ♦ యొదుగనిమ్ము.

(అనుబంధము 20.)

సీ. పూర్ణచంద్రునిబోలు ♦ పూబోడిమోము క
న్గోయితో గనుగొన ♦ నోమనోకో
రహిమించునానఖా ♦ గ్రిములతో బిగివగు
చన్నులపైనాటు ♦ చెన్నడోకో
మధురసమూరెడు ♦ మానినివాతెరఁ
దిన్నగానేనాను ♦ చెన్నడోకో
దనరఁజౌసీతిబం ♦ ధనములఁ దేల్చెడి
పన్నుగడలఁబన్ను ♦ చెన్నడోకో
గీ॥ సకలకాంక్షలు నేటితో ♦ సమసెనోకో
పాపచిత్తుఁడు గురుఁడెడ ♦ బాపెనోకో
యెంతవాఁడు విధాతృఁడి ♦ క్లేర్చెనోకో
చూడనిచ్చోటఁ జావుచే ♦ కూడెనోకో.
అహో ! తరుణీ !

సీ. పంచలోహములెన్ని ♦ భంగులఁ బెనఁగిన
మేలికడానితోఁ ♦ బోలనగునె
పక్షులుశుకపిక ♦ ప్రకరంబులెన్నైన
వాసియౌ హంసతో ♦ పాటియగునె ?
యాతతంబుగనెల్ల ♦ యలరులు మందార
పుష్పంబుతోసరి ♦ పోలనగునె ?

ఘనమగు నెన్ని వృ - క్షములైనగాని శ్రీ
చందన ధుర్యమముతో ♦ సామ్యమగునె ?
తే॥ గనుక నారీతి భామినీ ♦ జనములెల్ల
వనితనీగోటితో సాటి ♦ వత్తురటవె ?
మెన్నగా నేరఁగోర్కెలె ♦ న్నెన్నొయుండె
నన్నికోరిక లడుగంటె ♦నంబుజాక్షి!

ఆహా! తారాసతీ! పరసతియు గురుసతియును కూడనగునట్టి దానిని గురించి యింతగాఁ జింత సేయుట బరిశీలన జేయ నేనెంతో వ్యర్థుండనని దృఢపడినది. యికనైనను నన్నుగ్రమ్మియున్న మోహాంధకారమును సూర్యోదయంబుచే మొదలంట దుంచివేసి గురుకాంతపై భ్రమను విసర్జించి యుచితగతి బ్రవర్తించి కీర్తి కాంతను సంపాదించ బూనెద. (అని రిచ్చవడుచు) యింతకుమున్ను తెలిసియో తెలియకయో యొకతప్పు జేసితి. నది యెద్దియో? (యోచించి) స్మృతి దప్పినట్లున్నది ? అయిన మరల జ్ఞప్తికి దెచ్చుకొనియెద. (యోచించి)

కం॥ తలఁపగులాంగనరతమును
విలసిత సౌఖ్యంబులేమి ♦ వేశ్యలతోడఁ
గలయుట ధనహానియు బెర
చెలులరతంబేరతంబు ♦ సిద్ధము జగతిఁ॥

ఆహా ? యింతకుమున్ను నేఁజేసిన యోచన యిదియే ? యిప్పటికి జ్ఞప్తికి వచ్చినది.

(అనుబంధము 21)

చ॥ ఎటుక్షణమోర్తు నీవిరహ ♦ మేకరణింభరియింతునయ్యో మీ
దటమటుమాయదైవమిటు ♦ దాకొని సేయుటెరుంగనైతి బో
కుటిలుఁడు మన్మథుండు మదిఁ ♦ గొంకక గూరత సేయబూనె న
క్కట ! చిరుతెమ్మెరల్ చిరుత ♦ గండ్లుగఁ బైబడఁజొచ్చెనెట్లకో?
(మన్మథునవలోకించి)

కం॥ పగతుడనే బాంధులకును
బగతుఁడనే దమ్ములకును ♦ బాదోధులకున్
బగతుఁడనిలజక్కవలకు
బగతుఁడనేసోదరికిని ♦ బగతుఁడ మరుఁడా!

చెట్టా! నేనే యింతగట్టివాఁడను. యిట్టి దిట్టడనగు నన్నట్టుకొని బట్టుగల బాణములఁ బరవుటపరువని యెంచితివా? పంచసాయకా!

(అనుబంధము 22)

ఉ॥ తామరసాలయాత్మజుఁడఁ ♦ దామరసాలయు కేను దమ్ముఁడన్
మామను నీకుగాదె? యభి ♦ మానమొకింతయు నాటకక్షమదీ
దామసమూని నిర్భయతఁ ♦ దామరశాస్త్ర చయంబుచేతనే
దామరతంపరంబుగనె ♦ దంబగులందగవేర్యుఁబూనితో॥

గీ॥ కీరమాయిట్లుగేరుట ♦ కూరిరవృత్తి
ఝుమ్మటంచును నాతల ♦ దిమ్ముబట్ట
దొమ్మిగారేగి మీరు గా ♦ నమ్ముసేయు
తిమ్మిగాదది తేఁటకు ♦ లమ్ములార!

కం॥ రోలంబరాజ సంపఁగి
మాలికలకు నోడిపోయి ♦ మరణముపాలై
మూలుగుచు మానితోరల
నోలంబుండి మరివచ్చు ♦ టొప్పనె ఘనమె?

కం॥ చిగురె విలుకాడునాకిక
బగయైనను శుకపికాళి ♦ పలుకుట తగునె
పగతులచేఁజుట్టములును
బగవారను మాటలిల న బద్ధంబగునె?

హా! లోకమోహన మనోహరరూపిణీ! మహిళామణీ!

(అనిమూర్ఛబోవును.) (అవనికజారును.)

---:o:---

(తృతీయరంగము తారమందిరము.)

———:0:———

[ ప్రవేశము: తార, మదనసాయక ]

తార—మదనసాయకా!

మద—ఏమి.

తార—నీకుఁదెలియనిదేమున్నది? అయినను సిగ్గువిడచియుగ్గడించెద.

మద—ఏమది? కానిమ్ము,

(అనుబంధము 23)

తార-సీ॥ కొమ్మనామనవి గై ♦ కొమ్మ నామదికేమి
యోచన యొక్కింత ♦ దోచదమ్మ
కమ్మవిల్తుఁడు బూవు ♦ టమ్ములురమ్మ న
ముమ్మరంబుగనొవ్వ ♦ గ్రొమ్మెనమ్మ
కోయిలల్ గుమిగూడి ♦ గూడి కోయనికూత
లను మరిగూయజొ ♦ చ్చెనుగదమ్మ
శుకములుచెలరేగి ♦ వికటధ్వనులు చేసి
చకచకలాడించ ♦ సాగెనమ్మ
గీ॥ తుమ్మెదలు దొమ్మిగాఁ దల ♦ దిమ్మబట్ట
మూగిగానమ్ముసేయఁగాఁ ♦ బూనెనమ్మ
అంచితంబుగ నదిఁబరి ♦ కించి చూడ
నావిధాతృని దయ దూర ♦ మాయెనమ్మ.

మదనసాయకా! నాముద్దులమూటను నిద్దురలోనైనను గద్దరించి యెరుంగను? అట్టి సుందరాంగుని పొందుబాసి నేనెంతదనుక బ్రతికియుందును?

మద—(స్వ) ఓసివగలాడీ! యెంతదానవే నీవు? (ప్ర) తారా! మగనిదిగనాడిన మగువలు తగులుకొన్న మగనినైనఁ దిరుగపగ జేసికొనక వగలబొగలి వానిదగిలి యుండుట యొక్కవసంగతి యేగదా?

తార—చెలీ! నీవిట్లెక్కసమాడకున్న నింకొక్కటి దెల్పెదను.
మద—అమ్మా! నేనిపుడేమియంటిని? చంద్రునివదలదగదంటిఁగాని...
తార— (అనుబంధము 24)

సీ॥ ఓరమణీమణి! యురుతరంబై నట్టి
యారుచిరాస్యునా ♦ య్యారమేమె
నాకొరకిలఁబుట్టి ♦ నాడని చెలియక
వాని కౌఁగిలి బాసి ♦ వంతబడితి
వాని భుజంబులు ♦ వాని మొగంబును
వాని యురంబును ♦ వాని చూపు
వాని మధ్యమమును ♦ వాని చెక్కులిజిగి
వాని చాతుర్యంబు ♦ వగనయారె!
గీ॥ మానినీరత్నములుగని ♦ మారుబారి
కోర్వలేక భ్రమోన్మోద ♦ మొందియతని
పైనిప్రక్కనుబడి దగు ♦ బంధనముల
సయముగాఁదేల కుందురే? ♦ సమ్మదిని॥

అట్టి పుణ్యపురుషుని పొందువిడిచి గాని వాని మరచిగాని నేనెట్లు బ్రతుకగలను?
మద—తారా! పురుషులొకరికొకరు పరస్త్రీ పరపురుషుల నంటదగదని పెద్దలు చెప్పుట విని యెఱుంగవా?
తార—ఎఱిగిననేమి?
మద—ఎఱిఁగియేగాబోలును. అట్టి నీతులనెల్లఁ బాతిపెట్టి పాపకృత్యమునకు గట్టిగా నొడిగట్టుటొక దిట్టతనమని యెంచినది. తెలిసినవారెట్టి పనులనైనఁ జేయసమర్థులే?
తార—(నవ్వుచు) సఖి! ఈలోకంబునఁ గొందరబలులు తమ సతులం దృష్టిఁ జెందింపఁ నేరక పరపురుషులు తమ సతులనంటుదురను తుంటరి బుద్ధిబూని పరస్త్రీలఁ బొందుకంటె పాపమొండు గలదా? అని "తాటాకులలో" వ్రాసిరి. గావున అట్టి

యాకుల పాటుఁగని మనమిప్పు డాకులపాటు బడనేల? నని నా యభిప్రాయము.

మద—శాబాసు! యెల్లరకు శ్రవణానందమగు సంగతియిది యేసుమీ? యింక నిటువంటి వేమైన గలవేని వెల్లడించినాయుల్లమానంద మంద జేయుమని కోరుచుంటిని.

తార—

ఉ॥ కాంతరో! వానిపై భ్రమ జొ ♦ కాటముగా నెటదాతునే? బళా!
కంతు దిరస్కరించు నిజ ♦ కాంతుఁడు చేరినపాన్పుమీఁద నా
వంతయు సేపు నొత్తిగిల ♦ నట్టి శరీర మదేల ప్రాయముల్
బంతుగనుండి యేల? నోకో ♦ పాపపుదైవము బాపెనక్కటా!

బళేబళే యబ్బలుపోటరి జిగిబిగి కౌఁగిలి వదలిన నాబ్రతుకొక బ్రతుకా? మదనసాయకా! నీవు బాగుగ యోచింపుము.

(అని నిట్టూర్పు విడుచుచున్నది.)

మద—తారా! వేసటఁబడకు. కొంచెమోర్చితివేని నీమనోరథ మీడే రకపోదు.

తార—ఈడేరిన ట్లీయున్నది. ఇసీ! నాకుదగిన రూపవంతునితో సుఖించ నోమనియీపాపపుజన్మమేల? ఈసౌందర్యమేల? ఈవయసేల?

మద—అమ్మా! విచారపడకు.

తార—సఖీ! నాకేమి విచారము? ఒకటియేగదా!

మద—ఒకటి యేమిటి?

తార—

సీ॥ సొగసుగానికి దృష్టి ♦ సోకనంచనివాని
రంగును గనుల ♦ జూడంగనైతి
గబ్బిగుబ్బలుఁగమ్మఁ ♦ గందునంచనివాని
నునుమేను కౌఁగిట – నునుపనైతి
జిలిబిలియమృతంబు ♦ దొలుకునంచని వాని
చక్కని కెమ్మోవి ♦ నొక్కనైతి

చెలువంబు చెమటచేఁ ♦ జిలుకు నంచని వాసె
గలయుచోఁ గసిదీర ♦ మెలఁగనైతి
గీ॥ నట్టి యావన్నెకానితో ♦ నణఁగి పెనఁగి
కదిసితనివారఁ బిగ్గన ♦ కౌఁగిలించి
పెదవినొక్కుచు రతికేళి ♦ బెనఁగలేక
బేలనైపోతి నీరీతి ♦ లోలనేత్రి!

మగువా! పగవాఁడగు మగఁడు వెగటులేని వగలఁదగిలి పొగలు మమ్మునగలుపగలుజేసి దిగులు దగిలించెను. ఇంతకెక్కుడు విచారమేమియున్నది?

మద—నావంటి చెలియనీకుగల్గ దిగులు పడవలసిన పనిలేదు. ఎట్లనైన నాచంద్రుడు నీకౌఁగిట నలంకరించునట్లు జేసెదగాని యూరడిల్లు మూరడిల్లుము.

తార—సఖీ! నాశక్తికొలఁది దగుప్రయత్నముచేసి చందురుని యిందు దెచ్చినీడెందమానందమంద జేయుదాననని యభయహస్తమిమ్ము

మద—అట్లనే యిచ్చెదను. (అని చేతిలో చేయివేయును.) తారా! నేనిదే పోయివచ్చెదను.

తార—అరచేతనైకుంఠము జూపినట్లు మాట చెప్పి పోవుచుంటివి. తిరుగనీవు వచ్చెడిదనుక నుయ్యాలలూగు నాప్రాణములు నిల్చుటెట్లనో, యెట్లనైనను బలాత్కరించి నిల్చుకొనియెద.

మద—(చిరునవ్వుతో) ఇప్పుడేఁ పోయివచ్చెద. నాకేమి పారితోషికము?

తార—సర్వము నీదియే పోయిరమ్ము. (అందరునిష్క్రమింతురు)

(అవనికజారును)

———:o:———

(తృతీయరంగము ఉద్యానవనము-)

———:o:———

[ ప్రవేశము: చంద్రుఁడు ]

చంద్రు—(స్వ)

సీ॥ సకలసంపదల కా ♦ స్పదమైనయట్టి వ
సంతకాలము వేళ ♦ సంతసముగ
పికమిథునంబులు ♦ ప్రియముతోరతికేళి
గొంకకఁ గులుకుచు ♦ కోయటంచు
కుత్తుకకుత్తుక ♦ నొత్తిగిలఁగజేసి
కౌఁగిలింతలను సు ♦ ఖముగ మెలఁగు
చుండె, బో, గన్నులఁ ♦ బండువుగానాయె
నక్కటా! తలవంపు ♦ లాయెనాకు
గీ॥ పాంధికనాధారమిసుమంత ♦ లేక నేలఁ
బడినతీఁగయ చందానఁ ♦ బడఁతిలేని
కాలమున నెన్ని సుఖముల ♦ గల్గెనేని
ఇలను పురుషుల కాబ్రతు ♦ కేలనొక్కొ ॥
(అని విచ్చుపడును)

[ ప్రవేశము: మదనసాయక ]

మద—ఆహా! యేమియీవింత. తారాసతి చంద్రమునియందు బద్ధానురాగమైయుండినట్లే చంద్రుఁడును తారయందుబద్ధానురాగుఁడై యీపాదరింటఁబడి మరిమరి పరితపించుచుండెను. ఈసమయమందు నేనాతని చెంతజేరి తారాసతి తనపై మోహంబుచే నన్నపానీయాదుల విసర్జించి తుదకు ప్రాణపరిత్యాగము జేసికొన దలచి యున్నదని విన్నవించ నావెనువెంటనే యాచంద్రుఁడచ్చటికే తెంచి యామందగామినికోరిక త్వరగా దీర్చు ప్రయత్నముఁ జేయఁగలడు. వెదకబోయిన తీగపదములకు దగులుకొన్నట్లీతఁడిచ్చోట గనుపించుట నేను జేసికొన్న

పుణ్యముగాబోలు. (యోచించి) కాదుకాదు మాతారాపతి జేసికొన్న పుణ్యమేయగును. ఇందుకు సందియములేదు. (చంద్రుని సమీపించి) చంద్రా! చంద్రా! పలుకవేమి?

చంద్రు—
ఉ॥ ఎవ్వరి చిన్నదానవే? మృగేక్షణ!

మద— నేనే?

చంద్రు— శభాసునేనవా,
యెవ్వతెవంటివి?

మద— అగ్గురునియింతికి స్నేహితురాలను!

చంద్రు— అగ్గురుం
డెవ్వడె? యింతియెవ్వరె?

మద— బలే! దగునవ్విటకత్తె గాదొకో

చంద్రు— యవ్విటకత్తెయెవ్వతె?

మద— యొయారియ తార? యటంచునెంచుమీ?

చంద్రు—ఆహా! తారాసతీ! (అనిమదనసాయకనుగదియగమికించును)

మద—చంద్రా! నేను తారనుగాను? మదనసాయకను నన్నదియ నే లెంచవవేమి? యటుంగుము? (వెనుకకు నెట్టును)

చంద్రు—నీవా? నేనుతారయనుకొని భ్రమపడితిని.

మద-చంద్రా! ఆకాంతామణియగు తారాసతి యచ్చట నీకంటె నెక్కుడుగా కంతుదురంత సంతాపానలంబున కోర్వలేకక్షణంబొక యుగాంతరంబుగాఁ జింతించుచున్నది. నీవిపు డాలలనామణి మనోరథమీడేర్చు తలంపు గలదేని గ్రక్కున గదలిరమ్ము.

చంద్రు—(స్వ) ఆహా! నాతపఃఫలంబుచే నాకోరిక లీడేరు సమయము సంఘటిల్లినది. (ప్ర)

కం॥ పంకజదళనేత్రిరో నే
సంకేతితమైనపొదకు ♦ జయ్యనవత్తుం
గొంకక నాసీమకు నా

సాంకపగంధిని బిరానఁ ♦ జను దెమ్మనుమీ॥

మద—చంద్రా! నీ చెప్పినది పొరబాటుగావింటి. నింకొకమారు చెప్పుము!

చంద్రు—నీకు తెలియనిదేమియున్నది. నేజెప్పనక్కర లేదు.

మద—అటులైన మున్ను మీరు నియమించుకొన్న పోలికి తీగలచే, నల్లిబిల్లిగా బెనంగుఁపొన్నపొద కవ్వన్నెలాడిని గ్రన్ననవచ్చు పన్నుగడ బన్నెదను. నీవును సత్వరంబుగా నచ్చటికిరమ్ము.

చంద్రు—మదనసాయకా! పొమ్ము. నీప్రయత్నము జూచుకొమ్ము.

(నిష్క్రమించును) (అవనికజారును)

———:0:———

(పంచమరంగము తారమందిరము.)

———:0:———

తార—(స్వ) నానెచ్చెలి యింకను రాదయ్యె? తాఁబోయిన కార్య మేమయ్యెనోగదా?

[ప్రవేశము మదనసాయక]

తార—నెచ్చెలీ! వచ్చితివా?

మద—నేనువచ్చుటయేగాక చంద్రునిగూడ దెచ్చితిని.

తార—ఏడీ! నావలపులదొర.

మద—ఇచ్చటికే దెచ్చితిననుకొంటివాయేమి?

తార—మరియింకెచ్చటికి వచ్చునట్లు జేసితివి?

మద—ఎచ్చటికా? అచ్చటికే?

తార—చెలీ! యెకసక్కెమాడకు. నిజముచెపుమా వేడెద.

మద—చల్లకువచ్చి ముంతదాచనేల? నతండు తొల్లిమీరు నియమించుకొన్న ఘుమ్ముఘుమ్మని సౌరభమ్ము గ్రముకొను పూపొదకు జేరెదనని జెప్పిపంపెను. నీవును అచ్చటికే విచ్చేసితివేని నీమ్ము,చ్చిరితనము దీర్పనోడంబడు నిందుకు సందియంబు జరుగదు.

తార—(సంతోషముతో) ప్రియసఖి! నీవంటి నెచ్చెలిగల్గ నాకేమి

కొఱంత ? నీ వొనర్చిన యుపకారమునకు బ్రత్యుపకారమేమి జేయ
గలను ?

మద——ఏమిలేదు. నన్ను మఱవ కుండుటయే చాలును.

తార——నేను బ్రతికియున్నంతదనుక నీచేసిన మేలుమఱవనురా నేరదు.

మద——యీమాట లెంతవరకు ?

తార——నీవును నేనును ఉండువరకు.

మద——నిజముగానా ?

తార——అబద్ధమా ? అదికల్ల.

మద——అటులైన నసరే! నేను పథపరిశ్రమదీర్చుకొని వచ్చెదను నాకు శెల
వొసంగుము.

తార-మంచిదిపోయిరమ్ము. (ఇరువురునిష్క్రమింతురు.అవనికజారును)

( షష్టమరంగము:ఉద్యానవనమునందు పొదరిల్లు.)

[ ప్రవేశము:తారా చంద్రులు.]

(అనుబంధము 25.)

చంద్రు-సీ. తార దాపరమేల ♦ మారుబారికితాళ

మోరువలేని నన్ ♦ జేరరమ్మ

జేరవచ్చియు తమి ♦ దీర బారటుసాచి

గారవంబుగ బిగి ♦ కౌఁగిలిమ్మ

బిగి కౌఁగలిమొసంగి ♦ పెక్కుభంగుల బ్రేమ

ముడిబడఁగమ్మని ♦ ముద్దులిమ్మ

ముద్దిడియున్మోద ♦ మును జెందియున్న న

న్నధరామృతము కొంచె ♦ మానసిమ్మ

గీ॥ అధరపానంబుజేసిన ♦ యవలసరస

మొప్పుజన్గవగోరుల ♦ నుంచనిమ్మ

గోరులుంచినపిమ్మట ♦ మారుకేళి

దేలఁగానిమ్మ నను గడ ♦ దేర్చుసుమ్ము.

తార——మనోహరా ! మూడుకాళ్ళ ముసలాతఁడు నిన్ను పొమ్మన్నం

తనేనన్ను విడనాడి పోవుటకు నీమానసంబెటుల నొప్పినది ? ఇది న్యాయమని తలంచితివా ?

చంద్రు—మనమవలంభించిన కార్యమతిదూష్యమగు కతంబున నింక గొంతదనుక నుండ వెల్లడియగుననిఁ గురునాజ్ఞ దాటక గుట్టుగా బోయినాఁడను. ఇదియొక తప్పగునా ? ఐనను యిప్పుడు మిగిలినదేమి ? నీకు నాయందెక్కుడు మక్కువగలదేని లజ్జాభిమానంబులు విడచి నా వెంటరమ్ము. నానిజాంగణమునకుఁ బోవుదము.

తార—వచ్చెద ప్రియా ముందు నిన్నొకసారి గాఢాలింగనంబొనరింప వలయునని త్వరపడుచున్న యీ మేని బులుపును దీర్చినన్ను ధరింపుము. (అని కౌఁగిట జేర్చుకొని) చంద్రా ! నీవునన్నిచ్చటికి దోడుకొని పోవదలంచితివి ?

చంద్రు—బ్రహ్మపంపున విశ్వకర్మచే నిర్మితంబైన మా ప్రతిష్ఠాన పట్టణంబునకు దోడికొని పోఁదలంచితి ? నచ్చటికి నా వెంట వచ్చెదవా ?

తార—రాకనేమి నీపొందుబాసి యొక్కక్షణకాలమైన యోర్చియుండజాలని నన్ను విడచిపోవుట నీకు దగునుగాని నాకు దగునా ?

చంద్రు—అటులైన పోవుదమురమ్ము.

తార-చిత్తము. (యిద్దరు నిష్క్రమింతురుతుఅవనికజారును)

చతుర్థాంకము సంపూర్ణము.





# తారాచంద్రీయము

## పంచమాంకము.



[ ప్రథమరంగము బృహస్పతియిల్లు ]

[ ప్రవేశము:బృహస్పతి, వికటచతురుఁడు. ]

బృహ- గీ॥ వికటచతురుఁడ నాముద్దు ♦ వెలదియెందు
బోయెనో! ఇంతదనుక రా ♦ దాయెమరల
నిలయమున బరిపరి విధం ♦ బులను జూచి
నాడ, నిమిషము మరువను ♦ నన్నుతార ॥

శిష్యా! మనతారాసతి యెందుబోయినదో?

విక-ఇరుగుపొరుగిండ్ల కేమైన బనిఁజేయించుకొన బోయినదేమో?

బృహ—భ్రష్టా! చెడ్డకూతలు కూసెదవేమి?

విక-అయ్యా! చెడ్డా పడ్డా ననకుంటే మీదానిఁ జూచుకొనరాదా?

బృహ-ఛీ. ఛీ. మాందేమిటిరా?

విక-మీం రెరుంగరాయేమి? దివ్యజ్ఞానమని.

బృహ-నిజమేరా! (ఆకాశము దెసఁజూచి)ఓరీ మనతారచంద్రునితో
బోయినదిగదా?

విక-(గుండెలుకొట్టుకొనుచు) అయ్యో! అయ్యో! మనయమ్మనుచం
ద్రుఁడు దీసికొని పోయెనా? యెంతపని యెంతపని.

బృహ—వాఁడు కాసంతయైన లక్ష్యములేక యింతపని జేసిపోయెనే?
నేనేమి సేయుదు?

వికా—గురువరా ! యొకమనవి

గీ॥ ప్రేమగల శిష్యుఁడతఁడని ♦ పెద్దఁజేసి
నీకుమారుని గాఁజూడు ♦ నెలఁతయనఁగ
తన కుమారునిగా జూచి ♦ తగులుకొనిదె
నిన్నిటికి మీరుజెప్పిన ♦ వన్ని జరిపె॥

అయ్యా ! 'మనయమ్మగారి తప్పేమిగలదు ? మొదటనుండియు తుదవరకు దమ్మిగట్టఁద్రాళ్ళు తామే దెచ్చుకొంటిరి.

బృహ—ఓరీ ! నేనా తారాసతిని యిట్లుజేయుమని చెప్పితినా ? నారాయణ ! నారాయణ ! నేనిక జంధ్యాలుదెంచుకొని సన్యాసి నయ్యెద. (అని జంధ్యములు ద్రెంచ యత్నించును)

వికా—(తొందరగా) అయ్యా ! బృహస్పతులవారు మీరింతపనిచేయ వలదు. నామనవి వినుఁడు. (అని చేతులుబట్టుకొనును)

బృహ—ఓరీ ! నీవటుండుము.

వికా—నామాటవినుఁడు. మీరీపని జేయకండి. మనము గుంటపాలెము పోదము రండు.

బృహ—ఎందుకు ?

వికా—ఎందుకా ? అందుకే !

బృహ—చెప్పుమురా ?

వికా—ఏమేని చెప్పుదు. (నవ్వుచు) మంచిపడుచును దెచ్చుకొనుటకు.

బృహ—ఓరి పరమద్రోహీ ! దుర్భాషలాడెదవేమి !

వికా—సరిసరి. యివి దుర్భాషలా ? నాదేమిపోయినది లెండి.

బృహ—ఓరీ ! నేనీ జనులలో శిరమెత్తుకొని దిరుగుటెట్లు ?

వికా—ఎందుచేత ?

బృహ—ఇందుచేతనే.

వికా—అట్లైన శిరస్సు బరువెక్కె నేని దాని యొకచోటబెట్టి తిరుగ వచ్చునుగదా ?

బృహ—ఓరీ ! నీవిట్లు ప్రేలక నామాటవిని పరుగు పరుగున ప్రతిష్టాన పట్ట

ణము ప్రివేశించి చంద్రునకు దగుమాటలుచెప్పి తారను దెచ్చి నాస్వాధీనము జేయుము.

విక—మీకేమి కుదురుగా గూర్చుండువారు. మాటలెన్నైననుఁ జెప్ప గలరు. మీరు గురువులని మీమాట జవదాటక నేనా చంద్రునకడకు బోయితినేని నన్నుబట్టి తన్నించకవదలివేయుట కంత వెఱ్ఱివాడా ?

బృహ—వాఁడంత క్రూరకృత్యముఁ జేయదలంచడు. నామాటవిని పోయిరమ్ము.

విక—అయ్యో !

గీ॥ ప్రాణముండిన నెట్లైన ♦ బ్రతుకవచ్చు
నీదుతావున విద్య మా ♦ నెదనుగాని
పలక పుస్తకములనిమ్ము ♦ ప్రాభవముగ
నస్మదీయగృహంబున ♦ కరుగువాఁడ॥

బృహ-ఓరీ ! నీవు చంద్రుని చంతజేరుటకంత కష్టమయ్యోనేని యింకొక్కటి చెప్పెద.

విక-ఏమది(స్వ) ఆయ్యో గ్రహచారమా ! నన్నేమి జేయఁదలఁచితివి?

బృహ-మన మిరువురము నాసురపతికడకరిగి యీసంగతి విశదబఱచితిమేని మనకార్యమాతనిచేఁ జక్కఁబడును. ఇంతమాత్రమునకే నీవు చదువును చాలించుకొననేల ? నావెంటరమ్ము,

విక-ఆ. యిదినాయిష్టమేయగును. పోదము రండు.

(ఇరువురు నిష్క్రమింతురు.) (అవనికజారును.)

:0:

(ద్వితీయరంగము. ఇంద్రుని సభాస్థానము)

[ ప్రవేశము:చంద్రుఁడు, ఉపేంద్రుఁడు, దిక్పాలకులు నారదుఁడు. ]

ఇంద్రు—దిక్పాలకులారా ! మీకెల్లరకు మున్ను నాచేనియమింపబడిన కార్యములెల్ల ధర్మాధర్మ విచారణఁజేయుచు నపరిమితానందంబుతో నెరవేర్చుచుంటిరా ?

దిక్పా—(లేచినిలచి) భవదీయశాసనంబుదాటకజరుపుచున్నవారము.
ఇంద్రు—ఉపేంద్రా! బృందారక బృందం బపరిమితానందంబుగా సత్కర్మ లొనర్చుచు జక్కగా నున్నవారలే?
ఉపే—తమకరుణగల్గ నేమికోరంత సంఘటిల్లును.

[ ప్రవేశము:అప్సరసలు. ] (అనుబంధము 26)

అప్సరసలు- వనమయూరనృత్తులు.

ఇమ్ముగను గప్పుర వి ♦ డెమ్ముమరియిమ్మా ♦ నెమ్మొగము ముద్దులిడ ♦ నెయ్యముగ రమ్మా, రొమ్మునను రొమ్మునిడి ♦ గ్రమ్మ దయసుమ్మా ♦ సమ్మతిగ నమ్మితి వి ♦ మమ్ము విరజిమ్మా.

2 మక్కువయుదాయమరి ♦ మంచిపనియానా ♦ కక్కురుతితి యేలబిగి ♦ కౌగిలి బిరాన న జొక్కముగ నిచ్చిరతి ♦ సూటిగాను పేనక న్నెక్కుడుగ జూచినటు ♦ లెంతు మరియాదన్.

మత్తకోకిలావృత్తము.

కూర్పిరులు బుద్ధినిబూని నాపయి ♦ కోరచూపు లికేలరా
భూరికామకళాకళా మామరి ♦ పొంగెడా మరియాదరా
ఓరి నామొరనాలకించి పు ♦ రోసరిల్లిని హర్షమిం
పార నన్నసి పూర్వముంబలె నైననుండిన మేలురా

ఇంద్రు-ఉపేంద్రా! ఇయ్యప్సరసల యాటపాటలభినయంబుల కానందమందితిని. నికవీరిం దగినరీతిం గారవించి పంపుము.
ఉపే—చిత్తము. కాంతలారా! యీవస్త్రాభరణాదులందుకొనిపొండు
అప్స—చిత్తము. దేవనాథా మాకు శెలవా?
ఇంద్రు—మంచిది పొండు. (నిష్క్రమింతురు.)

( ప్రవేశము:బృహస్పతి, వికటచతురుండు )

ఇంద్రు—(లేచి)సురాచార్యా! వందనములు.
బృహ—జయమగుగాక!
దేవ—ఆచార్యా! నమస్కారములు.
బృహ—మీకెల్లరకు శుభమగుగాక,

ఇంద్రు—ఆచార్యా! యీపీఠంబుపై వసించి యీయర్ఘ్యపాద్యాది విధులఁ బరిగ్రహించుడు.

బృహ-(తలవాంచి కూర్చుని మెల్లగా) గ్రహించినట్లే.

ఇంద్రు— గీ॥ సరసగుణసాంద్ర ♦ శిరము వంచంగ నేల?
సేమమేమీకు మోమిటు ♦ చిన్నబోవు
హేతువెద్ది! యొఁ వచియింపు డేనుగల్గి
యుండ నిటు వంతనొందంగ ♦ నొల్లదనఘ॥

బృహ-సీ॥ వినమింక దేవేంద్ర! ♦ వీను లింపొందఁగాఁ
జెప్పగూడనిమాటఁ ♦ జెప్పవలసె
నైన చెప్పెద నత్రి ♦ యాత్మజుండైనట్టి
భానునిజోడు ♦ సద్భక్తిఁ జేరి
వేదశాస్త్రములన్ని ♦ విపులంబుగా నేర్చి
నాదు భార్యను బట్టి ♦ నాడుగాక
కాసంత భయమంద ♦ కనుమచ్చు గనుపించి
నాసతీమణిపైని ♦ యాస జేసి
గీ॥ యేనుగృహమున లేకుండు ♦ టెఱిఁగి యెఱిఁగి
తారనాతడు గొనిపోయెఁ ♦ దగుదునంచు
నన్నుజూడడు గదనాకు ♦ నాటనుండి
హర్షమడిగెను బరవశ ♦ మయ్యెమనము॥
మత్తకోకిల (అనుబంధము 27)
మోసమయ్యెగదయ్య వాసవ ♦ ముక్కునూపిరి గల్గగా
నీసరిన్మరి నాపెతల్ వచి ♦ యింప శక్యమెకోబళా!

ఇంద్రు-ఒసమంజసచిత్త మిమ్మిపు ♦ డొందినట్టి విపత్తులం
భాసురంబుగఁ దీర్చెదన్ బరి ♦ పాలనంబొగి జేసెదన్

బృహ-భాసురాంగియు తార నన్నెడ ♦ బాసిపోవుటచే ధరన్
నాసమానులలోనఁ గౌరవ నాశమయ్యెగదాగనన్.

ఇంద్రు-ఆసరోజభవుండు వ్రాసిన ♦ యట్టివ్రాత దొరంగునా

కాసుగామియు గన్నులంగనఁ ♦ గా వశంబె బుధోత్తమా!

బృహ-కండక్రొవ్వువహించి చంద్రుఁడు ♦ గండుమీఱి మనోభవుక
పుండరీకదళాక్షి తారను ♦ బొందుమీఱఁగఁ జేకొనెక

ఇంద్రు-చెండివేశెద నాశశాంకు గృ ♦ శింపఁ జేసెద ధీరతక
గండుమీఱి మహోగ్రకోపము ♦ గ్రమ్మఁ దారను దెచ్చెదక

బృహ-కూళనై దొలి చేయుపాపము ♦ కూడివచ్చిన దక్కటా!
ఓలి నియ్యెలనుండి యెవ్వరి ♦ నుద్ధరించెద నేనిటా!

ఇంద్రు-మేలు గీడు నొకానొకప్పుని ♦ మేషమాత్రములోపలక
గాలకర్మవశంబునన్మరి ♦ కంటగించునె వారినిక.

హరిహరీ! యెంతపని. యెంతమోసము. ఎంతదుండగము.

బృహ- గీ॥ కారణంబేమొకోగాని ♦ తార యింత
దనుక నిటువంటి కార్యముల్ ♦ దలఁపదైన
గాక మానవు కాగల ♦ కార్యము లిలఁ
గాలగతి నెట్టజాలిన ♦ ఘనులు గలరె?

ఇంద్రు-గురువరా! మీరిట్టి స్వల్పకార్యమునకు వ్యాకులపడఁదగదు. నేనిపు డొక దూతనుఁబంపి మీ నాతీమణిని యిచ్చటికి వచ్చునట్లు జేసెద. చింతపడకుడు.

బృహ-నిర్జరేంద్రా! గోటనొపనికి గొడ్డలియేల? నీ యిష్టముగుఁజేయఁగడంగుము. నీవంటి శిష్యుఁడుగల్గ నాకిసుమంతయైన కొరంత రానేరదుగదా?

నార-(స్వ) ఈ స్వర్గంబునం దీపురందరు డొనర్చిన యజ్ఞసంతర్పణములందు గొంతుమట్టుకు పంచభక్ష్యాన్నములు తనివిదీర భుజించినను క్షుద్బాధదీరకున్నది. (యోచించి) దీనికంతగా యోచించవలసిన పనిలేదు. నేనిప్పుడే ప్రతిష్ఠానపట్టణంబునకేతెంచి యింద్రుడన్న వాక్యంబులెల్ల నాచంద్రునకుఁజెప్పి కలహమును బెంచి యందుచేఁ గడుపు నిండించుకొని కలహభోజనుఁ డను సార్థకనామమును నిల్పుకొని తృప్తిబొందెద. (ప్ర) గురువరా!

సురవరుని కరుణారసముజెందిన నీకేమికొఱంత? ఇమ్మహాత్ముఁడు నీకోర్కె నెరవేర్చకపోఁడు. దేవేంద్రా!

గీ॥ సురసవరేణ్యా నీవు ♦ గురునిపై నొక్కింత
కనికరంబుబూని ♦ కమలముఖిని
తెచ్చి సురగురునకు ♦ నిచ్చి సత్కీర్తిని
బొందు మిందుతోడఁ ♦ బోరిదైన.

ఇంద్రు—నారదా! ఈ స్వల్పకార్యమునకై సంగరము సేయువలెనా? ముందు సేవకుని బంపి చంద్రుని యభిప్రాయంబెల్ల నెరింగి తదుపరి తగిన యత్నముజేసి సాధించెదను.

నార—మంచిది. యట్లనే గానిమ్ము.

ఇంద్రు—చిత్తము. అనుగ్రహముంచుడు.

నార—అంతయు దైవానుగ్రహమేగదా! శలవా? (నారదుఁడు నిష్క్రమించును.)

ఇంద్రు—(శేవకునిఁజూచి)

సీ॥ వినవోయి సేవకా! ♦ వేడుకదనరంగ
వినుపింతుఁ జెందొవ ♦ విందుపురము
జేరి, యాచందురు ♦ జేరి యిట్లను మీవు
చారు చరిత్ర యా ♦ చార్యసతిని
చేపట్టవలవదీ ♦ చెనుబుద్ధులేల నీ
పాపమునకు నోడి ♦ బట్టితీవు
నవలాలపై వ్యస ♦ నము గొప్పదనుమాట
నవివేకమానసు ♦ లనఁగ వినవె

గీ॥ మేము మీతలిదండ్రుల ♦ మేలిగాంచి
సీదుతప్పుల నెంచకుం ♦ డితిమి ముందు
జూచి యిగ్గురు శరణంబు ♦ జొచ్చి వేడ్క
జంచలాక్షిని యిచ్చుట ♦ మంచిబుద్ధి.

ఇట్లుగా నేజెప్పిపంపితినని చంద్రునకుఁ జెప్పి మన గురుసతిని

దోడ్కొనిరమ్ము.
శేవ- చిత్తము. పోయివచ్చెద. (నిష్క్రమించును.)
ఇంద్రు—గురువర్యా! గృహంబున కేగుదమురండు.
(అందరు నిష్క్రమింతురు, అవనిక జారును.)

(తృతీయరంగము- ఉద్యానవనము.)

(ప్రవేశము: తార చంద్రులు)

తార—(ఆశ్చర్యముతో)

విద్యున్మాలావృత్తము.

ఈ యుద్యానం ♦ బెంతో హృద్యం
బై యొప్పారెన్ ♦ హాళిం బ్రేమం
గ్రాయం గాయం ♦ గా పైకంబుల్
బాయంజాలన్ ♦ బాతర్లాడన్.

చంద్రు— స్రగ్విణీవృత్తము.

భావినీరత్నమా ♦ భావజాత్మప్రియుం
డీ వసంతుండు హర్షాంబుధిన్మగ్నతన్
దీవిదానుండఁగా ♦ డీకొనెన్ జూడఁగన్
భావమందారయం ♦ బాటిలెన్ హర్షమున్.

తార— క్రౌంచపదము.

ఈ వనవృక్షం ♦ బుల్వారుసన్నా
కిపుడతిహితవృగ ♦ నెరుకపడంగన్
భావమునందుం ♦ బాదుకొనంగన్
బలుముదమొదవగఁ ♦ బలుకుడి వేగన్.

చంద్రు— క్రౌంచపదము.

దీవిని కందోయి న్గ ♦ ను మీావున్
డిగబడకను మ ♦ ది నిలుకడనేర్తున్
గానరమొప్పన్ జైత్రుఁ ♦ డు కొల్వన్
గడకతో బలములు ♦ గదియగఁ దీర్చన్.

తార—　　　　తోటకవృత్తము.

జాలము సేయక ♦ చక్కని శాఖా
జాలము వేరుగఁ ♦ జాటుచుజెప్పన్
గాలము బోయిన ♦ గాలుని రీతిన్
గ్రాలుచు మారుఁడు ♦ గాల్చెడె నన్నున్.

చంద్రు—సఖి! అటులైన

ధ్వవకోకిలావృత్తము.

మరువకంబులు- చంపకంబులు ♦ మాతులుంగల వంగముల్
కురువకంబులు బొండుమల్లెలు ♦ కోలితాలతమాలముల్
మరియు మన్మధచందనంబులు ♦ మాధవాద్యవనీజముల్
సరససౌరభమై వెలింగెవ ♦ సంతకాలపువేడుకల్.

గీ॥ పిన్నచివురులు దిను వన ♦ ప్రియములెల్ల
ఫలవితతి మెక్కు శుక శారి ♦ కలు మరెల్లఁ
బరగఁ బూదేనెలాను బం ♦ భరము లెల్ల
గాన మొగి సేయుచుండు ను ♦ ద్యానమందు.

మనోహారి! యింక జాగొనరింపక నంతిపురంబునకుఁ బోవుదము రమ్ము.

తార—రండు పోదము. (నిష్క్రమింతురు.) [అవనిక జారును.]

(తృతీయ రంగము.)

చంద్రుని దర్బారు- (ప్రవేశము: తారాచంద్రులు)

చంద్రు—ప్రియా! సురాచార్యు డెంతపరితాపమొందుచుండెనో! పాపము. మోసగించితిమిగదా? సఖి! చూచితివా? లోకము నం దెందరో కామాతురులై లజ్జవీడి బంధుమిత్రులాదిగాగల వారి విడనాడి విటులగూడి రచ్చలందు నగుబాట్ల పాలగుట.

తార—ఐననేమి? కానిమ్ము. (ప్రవేశం: సేవకుడు.)

సేవ—రాజా! యెవ్వరో యొక మునిశ్రేష్ఠుడువచ్చి హాజారము గాచి యున్నాఁడు, ఏమి శలవు?

చంద్రు—తారా! ఆ వచ్చినవారెవ్వరో? విమర్శింపవలయు గావున నీవు లోనకుం బొమ్ము. [తార నిష్క్రమించును.] (సేవకుని జూచి) సేవకా! వారి నిచ్చటికి వచ్చునట్లుజేయుము.

సేవ—చిత్తము. (సేవకుడు నిష్క్రమించును.)

(ప్రవేశము: నారదుఁడు.)

చంద్రు—(ఎదురుగాబోయి) మునిచంద్రమా! వందనములు.

నార—చంద్రా! జయమగుగాక.

చంద్రు—మునికులతిలకా!

కం॥ ఎచ్చోటికి వేంచేయుచు
నిచ్చటి కేతెంచినార ♦ లిప్పుడు మీరల్
విచ్చలవిడి యాకథనము
జెచ్చెర నిట దాయకను ♦ వచింపుడు వేడ్కన్.

నార—నేనిచ్చటికే వచ్చితిని.

చంద్రు—తాపసోత్తము లూరక రారని దలంచెద.

నార-చంద్రా! కం॥ గురుసతిని దెచ్చితీవని
గురుఁడదిగని స్వర్గమునకు ♦ గుందుచుజనియా
సురపతి కక్కథఁ దెల్పిన
సురవరుడాగ్రహము బూనె ♦ జుమినీపైనన్॥

ఇందుకొఱకు నీయభిప్రాయ మెఱుంగుటకై విచ్చేసితిని. ఏమనెదవు?

చంద్రు-(స్వ) కటకటా! నాదుష్ప్రవర్తన మిటువంటి మహనీయులకుఁగూడ నెఱుక బడెనుగదా? ఇసీ! పలువురిచే నిందింపఁబడినసజన్మ మెత్తియేమి జేయను? దైవకృతముదప్పదు. (ప్ర) మునిచంద్రమా! తరువాత?

నార— గీ॥ అష్టదిక్పాలకులతోడ ♦ నమర నాథుఁ
డాగ్రహంబుఁది నీతోడ ♦ ననియొనర్ప
దలఁచితరలెను గావున ♦ దమకకుండ
సంగరముసేయ నీకు మేల్ ♦ సంఘటిల్లు॥

చంద్రు-చిత్తమట్లనే యొనర్చెదనుగాని-

గీ॥ చూడనాకొక ప్రేముడి ♦ చుట్టమైన
లేడు నేనొంటిరిగను జే ♦ జేలబంట్ల
ప్రధనమందునఁబడఁగూల్చు ♦ పక్కియెట్లొ ?
దోచకున్నది దీనికి ♦ యోచనేమి ?

నార-ఎవరైనను కార్యాలోచనము ముందే చేయవలయునుగాని పిమ్మట చింతించిన లాభమేమి గలదు, ఐనను

గీ॥ భయముజెందంగవలవదు ♦ బ్రహ్మయిడిన
గాండివముబూని సురలసం ♦ గరమునందు
భంగపరచి యశంబు ని ♦ ల్వంగజేయఁ
బూనితోమేలు చేకూరు ♦ పోశశాంక ! ॥

ఎట్లంటివేని

ఉ॥ ఏనమరావతిన్వడలి ♦ యేగుతఱిఁ భృగుగాంచియిక్కధఁ
జానుగచెప్పినీకు డగు ♦ సంగరవీరుల దైత్యులం బ్రతి
ష్ఠాన పురీవరంబునకు ♦ సైన్యముతో నరుదెంచునట్లు స
న్మానము జేసితిఁ సుర స ♦ మాజముతో జయమందుమీ వనిన్॥

సరసిజారీ ! సురలవలన నరవీసమంతయైన భయమురానేరదు. కాలహరణంబగుచున్నది. నాకాజ్ఞనొసంగుము. బ్రహ్మలోకమున కేగవలయు.

చంద్రు-చిత్తము. మునీంద్రా ! అనుగ్రహముంచుఁడు.

నార-చంద్రా ! నీకు సంగరజయమగుగాక. నేబోయివచ్చెద.

చంద్రు-చిత్తము. (నారదుడు నిష్క్రమించును.)

[ ప్రవేశము: సేవకుఁడు ]

సేవ-నిశాపతీ ! వందనములు.

చంద్రు-ఓరీ ! నీవెవ్వండవు ?

సేవ-నేనింద్రుని సేవకుఁడను.

చంద్రు-ఇందేలవచ్చితివి ?

సేవ - ఇంద్రుని యాజ్ఞచేత.
చంద్రు - అయ్యింద్రుడెందుకొరకు నిన్నుబంపెను ?
సేవ — (అనుబంధము 28.)
చ॥ సరసిజవైరి మీకునొక సంగతిచెప్పెద !
చంద్రు - నెద్దియొ జెప్పుమా ?
సేవ - సురపతి యగ్గురూత్తముని ♦ సుందరిదారను దెమ్మటంచుబం♦ పిరి
చంద్రు - నిను బంపిరా ?
సేవ - నిజము ప్రేమముతో నిటు సేయ రేనియా
సురవరుఁడేగుదెంచి నిను సు♦క్ర—గఁ ♦జయభుజా బలంబునన్
చంద్రా ! యయ్యింద్రుఁడప గురుసతిని సమర్పించిశరణు జొరుట
మేలని శలవిచ్చిరి. యందుల కఖిలసురవరులు హర్షించి సన్నిచ్చటికి
బంపియుండి). మీయభిష్టమెట్లో యట్లొనరించుడు.
చంద్రు - సుమంతా ! వింటివిగదా ? సేవకుని వాక్యంబులు.
సుమం - చిత్తము.
చంద్రు - సేవకా !

సీ॥ ఓహోహో యింద్రుడెంతో ♦ గృహస్థుండయ్యె
నూహలేల నొకొ బ్రి ♦ తూష్యపమందుఁ
గోడియై గడుతమి ♦ కోర్క—నహల్యను
గూడుటకై కూతఁగూయ లేదె
కడమ దిక్పాలుర ♦ కథలేనెరుంగుదు
నిందుకొరకు నయ్యు ♦ పేంద్రుడింద్రుఁ
డిందుధరుఁడు కమ ♦ లేక్షణుఁడమరులు
మందలుమందలై ♦ మట్టుమీరి
గీ॥ ఇచ్చటికి వచ్చిరేని మా ♦ యించినొళ్ళు
చిందరగ వందరగ నేను ♦ జేతుగాని
సుందరాంగినియిప్పుడి ♦చ్చొటయుకల్ల
సంధికేనిక జొరనొల్ల ♦ జనుముమళ్ళి.

నేనిట్లంటినని నయ్యింద్రునకుఁ జెప్పుముపొమ్ము.

శేవ-చిత్తము. నామనవి నంగీకరింపుడు.

గీ॥ గురునిదారను బొందెడి ♦ కోర్కెమదికి
బుట్టుటయుచూడగాఁ బిచ్చి పట్టిగాదె?
కాక దగినట్టి వాఁడది ♦ నీకు తగద
టనిన, చెవినాటదేమంచి ♦ జనులకెల్ల.

చంద్రు-ఓరీ శేవకా!

గీ॥ పాతకుఁడటంచు జనులు ఛీ ♦ వాట్లుబెట్ట
సురగుకుండాగ్రహంబంది ♦ సాలయదిట్ట
సురవరుఁడు సంగరమున నా ♦ శిరముఁగొట్ట
నిచ్చకముబట్టి గురుసతి ♦ నిచ్చుటెట్లు॥

ఇట్లుగా జెప్పుము పొమ్ము. (సేవకుఁడు నిష్క్రమించును)

(తృతీయరంగము ఇంద్రుని యాస్థానము.)

[ ప్రవేశము:ఇంద్రుఁడు, ఉపేంద్రుఁడు, దిక్పాలురు ]

శేవ—(ప్రవేశించి) దేవేంద్రా! వందనములు.

ఇంద్రు-శుభమగుగాక. నిన్నుబంపిన కార్యము సాఫల్యమొనర్చికొని వచ్చితివా?

శేవ—దేవా!

ఉ॥ ఏమని విన్నవింతు నమ ♦ రేశ్వరకన్మిను గానఁడయ్యెనా
తామరసారి! సౌఖ్యముగ ♦ దారనుగూడి యథేచ్ఛఁబోయినే
దామనుమాట చెల్పఁగ మ ♦ దంబున మిమ్ము తృణీకరించెనం
గ్రామమునందు నాతని ని ♦ రాకృతి జేయఁగ నెంచుడీరిక౯.

నిర్జరేంద్రా! మీమాటనంగీకరించనితామరసారితో మోమాటము బెట్టుకొనఁదగదు యుద్ధంబునకు సన్నద్ధులుగండు.

ఇంద్రు—(కోపముతో) ఓహోసురలార్హా! సరసిజవైరి వచించిన వాక్యంబులెల్ల నీ శేవకునినోట వింటిరిగదా? వాఁడెంతకైనను సాహసుఁజేయఁగు.

దేవ—అపును సందియమేమి ?
ఇంద్రు—సభాస్తారులారా !
సీ॥ తటిమితటిమి పాక ♦ దనుజుని శిరమును
దరిఁగినసంగతిఁ ♦ దానెరుఁగఁడో ?
తరిమి వృత్రుండను ♦ దైతేయుగర్వంబు
రణరంగమున బోరిఁ ♦ గొనుటెరుఁగఁడో ?
జంభాసురునిబట్టి ♦ సంభ్రమమతితోడ
దంభంబడంచు వి ♦ ధంబెరుఁగఁడో ?
గట్టిగా గట్ల టె ♦ క్కలనూడఁగొట్టిన
యట్టి పరాక్రమం ♦ బది యెరుఁగఁడో ?
గీ॥ ఇట్టి వీరుండ నగుచు న ♦ య్యెంమఁబట్టి
మట్టుబెట్టక తారను ♦ మగుడ దోడి
తెచ్చి, గురునకు నీక ని ♦ దిరించనట్టి
మతము నాయదిగాకున్న ♦ మగతనంబె?

సురలారా ! నేను సకలచరాచరంబులు గకవికఁజేయు ప్రకటితబలుఁడనై యుండి యగ్గురుద్రోహియగు సరసిజారిని యింత మాత్రమునకే విడువదలఁతునా ? మీరెల్లరు ముందు సమర గమనోన్ముఖులై చనుడు. నేనిదే వచ్చెద.

దిక్పా—చిత్తము. (దిక్పాలకులు నిష్క్రమింతురు.)
ఇంద్రు—ఉపేంద్రా ! నావారణమును కొనినచ్చునట్లాజ్ఞాపింపుము.
ఉపే-చిత్తము దేవేంద్రుని నివారణమునుకొనిరమ్మని యాజ్ఞాపింపుము
శేవ—శేవకా! (శేవకుడు నిష్క్రమించి మరల ప్రవేశించి)
శేవ—దేవనాథా ! నిర్జరులెల్లరుసమరమునకరుగుచుండిరి. మావటీడు దొరవారికరీంద్రమునుతోడితెచ్చిద్వారముఁగాచియున్నవాఁడు.
ఇంద్రు—అటులైన నేనును వెంటనే వెడలుచుంటిని. ఉపేంద్రా ! నేను వచ్చువరకు నీవీస్వర్గమును పరిపాలనజేయుచుండుము.
ఉపే— చిత్తము. (అందరు నిష్క్రమింతురు.) [అవసిక జారును]

(పంచమరంగము. చంద్రుని యాస్థానము.)
(ప్రవేశము. చంద్రుఁడు, సేవకుడు.)

సేవ—దేవా! దేవేంద్రుండు బృందారకబృందంబు గూర్చుకొని సమరంబు సల్ప వచ్చియున్నాడు.

చంద్రు—దేవేంద్రుడు యుద్ధము సేయఁదలంచి వచ్చియుండెనా?

సేవ—చిత్తము.

చంద్రు—రానిమ్ము. వాని కండక్రొవ్వడంచెదను, సేవకా! మన సైన్యంబులనెల్ల సమరసన్నిద్ధులగమ్మని యాజ్ఞాపింపుము.

సేవ—చిత్తము. ఇదో పోయివచ్చెద. (అని నిష్క్రమించి, మరల ప్రవేశించి) దేవా! మన సైన్యంబెల్ల సంగరంబునకు కాలు ద్రవ్వు సమయంబున కొందరు రాక్షసులు మనకు సహాయులైరి. తమ రథసారథియు, శస్త్రాస్త్రసమేతంబుగా రథమాయత్తపరచికొని సింహద్వారము గాచియున్నవాఁడు.

చంద్రు—మంచిది. నేనిపుడే బయసమై వచ్చెదను. (అందరు నిష్క్రమింతురు.) [అవనిక జారును.]

షష్ఠమరంగము. యుద్ధభూమి.
(ప్రవేశము: ఇంద్రుడు, బృహస్పతి.)

ఇంద్రు—(చూచి) గురువరా! చంద్రుడసురవిసరంబులగూర్చుకొని వచ్చుచున్నాడు. ఈదైత్యేంద్రు లీతనికి సహాయముగావచ్చిన కారణంబేలనో యోచించుడు.

బృహ—(యోచించి) రాక్షసులు. తమంతటతామేవచ్చినవారుగారు.

ఇంద్రు—ఎవ్వనిప్రేరేపణచే వచ్చియుండిరి?

బృహ— సుగంధివృత్తము.

పోరుకూడి తిండిపోతు ♦ ప్రొద్దువోక శుక్రునిన్
జేరి యీసవిస్తరంబు ♦ జెప్పినంత నాతఁగుస్
వీరవర్యులైన దైత్య ♦ వీరులన్ముదంబునన్
బోరుగెల్వ బ్రొద్దుజోదు ♦ పొత్తుగోరి పంపెభో.

ఇంద్రా! శుక్రుని పేరేపణచే జంద్రునకు సహాయంబుగా వృష పర్వుండు మొదలగు దైత్యులు వచ్చినారు.

ఇంద్రు—మంచిది రానిమ్ము. వీరి నెల్లరంబట్టిమట్టుబెట్టెద నీక జూడుము

(తెరలో రాక్షసులు.)

చం॥ మనమున సుంతలజ్జ యను ♦ మానముఁబూనక యుద్ధభూమిక
యానిమిషులందరుం గొలువ ♦ నత్యధికుండ నటంచువచ్చితో
పనిగొనిజూడు నిన్నుసుర ♦ పంక్తిఁగలంచెద ముద్ధతింబెనం
గొన రణరంగమం దసుర ♦ కోటిని గెల్వఁగ నీకు శక్యమే ?

ఇంద్రు—

ఉ॥ మాటలు వేయునేల ? క్షణ ♦ మాత్రములో మిము నెల్ల నాముదిం
బాటిలునట్టి కోప దహ ♦ నంబున కర్పణ జేసి లోకముల్
మేటియటంచు బేర్కొ_న న ♦ మేయగుణుండగు నగ్గురూత్తముఁ
బోటినివేగ దోడుకొని ♦ పోయి సమర్పణ జేతు వేడుకన్.

రాక్ష-(తెరలో) కం॥ ఔరా! దేవకులాధమ
భీరుల కొందరిని జేర్చి ♦ పేర్చితికామ
ద్వీరభటుల బెగటార్చెడి
వీరుఁడవా ? జూపునీదు ♦ విక్రమమెల్లన్॥

ఇంద్రు— కం॥ ఇదొవచ్చుచుంటి రణమునఁ
గదలకమాతోడఁ బోరఁ ♦ గలవిక్రములం
మదమడగఁజేతు మీకు వ
రదుఁడుబితామహుఁడు ♦ సద్గురాన్వీడమిమ్మున్.

(తెరలో పెద్దకలకల)

అక్కటా మమ్ముంబట్టి పడగొట్టి దేవతలు నిర్భీతలయి పోవు చుండిరి. చంద్రా దీనులమైన మమ్మురక్షించసత్వరంబుగారమ్మురమ్ము

[ ప్రవేశము: చంద్రుఁడు రోషముతో ]

చంద్రు-ఓరీదేవాధమా! నిలునిలు పారిపోకుము నీపీచమడంచెద.

ఇంద్రు—చంద్రా! ఎచ్చటికేగెదవు? నిలు నిలు.
చంద్రు—ఎచ్చటికా? ఇచ్చటికే వచ్చుచుంటిని.
ఇంద్రు—ఎందుకొఱకు?
చంద్రు—నీపొట్టఁగొవ్వు మట్టుబెట్టుటకు.
ఇంద్రు—దుర్మతీ! ధర్మదూరుడవై బృహస్పతి దార యగు తారతో మారుకేళి దేలిన నిన్నీధారుణింగల సూరిజనులు దేరిజూడ ఘోరాజియందు నీపేరు మాపి నీరూపు నీరుజేసెద. జూడుము.
చంద్రు—క్రూరహృదయా! యీ గభీర భాషణంబులతో నేమి ప్రయోజనము. నీవు ఘోరాజియందు గదలక నిలిచితివేని నీబీరంబెల్ల నీటిపాలుజేసెద. నిక నాతో మార్కొని జయించి పొమ్ము.
ఇంద్రు—నీవననెంత. నీబలమననెంత. నిమిషమంతలో నంతకుని మందిరంబునకంపెద. (కోపంబుతో)

ఉ॥ ఓరి శశాంక నీభుజబలోన్నతి మాపెద సంగరస్థలిన్
చంద్రు— మేరయిదేరకారుల నిమేషములో బొలియింతుజూడరా
ఇంద్రు— శూరుడటంచు నం జగము♦స్తోత్రముసేయు నెరుంగవేర
చంద్రు— నీకౄరత స్రుక్కజేతు నిదొ♦జూడర నాశరవారిధారలన్
ఇంద్రు— గీ॥ కావరమున గన్ను♦గానక మత్ప్రభా
వంబు దెలియలేక ♦ వదరెదవుర
చంద్రు— కండక్రొవ్వుబట్టి ♦ గౌతమపత్నిని
బొందితౌర! తుచ్ఛ♦ బుద్ధిబూని.

ఇంద్రు—కలుషమునకు భీతిల్లని మీబోంట్ల కెట్టికార్యంబులైన నలక్ష్యంబుగానే యుండు. ఐనను, నిన్ను బోరాటమందు బోరిగొని గురుసతిని త్వరితగతి దోడుకొనిపోదుముగాని యూరకపోదుమా? నిశాచరాధమా!
చంద్రు—శచీనాథా! యనాథా! నీవాడినది నిజమే. కొక్కొరకో యని చక్కగా గోడకూతగూసి దొంగవై యహల్యాంగనతో

ప్రసంగము జేయుచు సంగమము జేయుట యనుకొంటివి కాబోలు. ఈ సంగరంబున నాదగుసాయకంబులచే నీచతురంగ బలంబుల భంగపెట్టితి. నది గనుంగొనిమైన పొంగుదొరంగ నగరిం గనుగొనబోక నష్టదశ పోరి జయంబార్జించదలంచియె వచ్చితివా? చోరా!

ఇంద్రు—నీచా! లోకపిశాచా! నీవిట్లుమితముగా ప్రేలుటేల? నీచరాచరంబు లదర నా నారాచంబులచే నీభుజబలపరాక్రమప్రకరంబును ద్రుక్కజేయకున్న నేను స్వర్గాధ్యక్షుండనా?

(ఇంద్ర, చంద్రులు యుద్ధము సేయుదురు.)

చంద్రు—ఇంద్రా! మధ్యందినమార్తాండుభాతి మండుచుండు శరకాండంబులు మెండుగా వచ్చుచుండె. వీటిందప్పించుకొనిపొమ్ము.

(ప్రవేశము: బ్రహ్మ.)

బ్రహ్మ—(తనలో)

కం॥ దీప్తాస్త్రాగ్ని ప్రళయము
ప్రాప్తంబై ప్రజ్వరిల్లెఁ బ్రచురముగా దా
రాప్తునకు నింద్రునకు సం
ప్రాప్తించిన కయ్యముడిపి ప్రమద మొనర్తున్.

ఇంద్రు—(చూచి) పితామహా! వందనములు.

బ్రహ్మ—దేవనాథా! శుభమగుగాక.

చంద్రు-పుండరీకాసనా కేల్మోగిడ్చెద.

బ్రహ్మ-శశాంకా! జయమగుగాక.

గీ॥ చంద్ర యిందుపైని ♦ చలమేల సురగురు
సతిని దోసమనక ♦ సమ్మతిగను
బట్టదగునె జరిగి ♦ నట్టిపనికి రోయ
నేల? దార నొసగు ♦ మీ గురునకు.

చంద్రు-పరమేష్ఠీ! యీసురవరులు నాకు గరములుగట్టరేని సురగురుని విరిబోడిని దిరుగ నొసంగువాడను.

బ్రహ్మ- గీ॥ ఓయి చంద్ర రాజ ♦ సూయయాగంబు నీ
చేయునటుల జేతు ♦ జెన్నుమీర
నప్పుడప్పనంబు ♦ లమరులు నీకిత్తు
రిప్పు డీగురునకు ♦ నింతినొసగు.

చంద్రు-చిత్తము. అలాగే సమర్పించెదను. (శేవకుని జూచి) శేవకా! యిచ్చటికా తారాసతిని కుమారునితో దోడ్కొనిరమ్ము.

(శేవకుడు నిష్క్రమించును.)

(ప్రవేశము: తార పుత్రునెత్తుకొని)

తార- లోకేశా! వందనములు.

బ్రహ్మ-కళ్యాణీ! కళ్యాణమగుగాక.

గీ॥ తార యీసుతుండు ♦ తారాపతికొ లేక
సురగురునకొ దెల్పు ♦ సుచిరముగ
రిత్త కలహమేల ♦ నిత్తరి బిత్తరి
సంశయింపదగదు ♦ జన్మవిధము॥

తార—(తనలో) ఆహా! బ్రహ్మదేవుడెంత నిర్దయాళుడు. నన్నిందరిలో బట్టుకొని నిజము చెప్పుమని యడిగెగదా? సిగ్గు నోరెత్తనీయకున్నది. నేనేమని దెల్పుదును. తగువారలెద్దియైనను దమకు దెలిసియు దెలియనివారివలె నడిగిరేని నిజముదెల్ప కుండుటమర్యాదగాదు. సురజ్యేష్ఠా!

(అనుబంధము 29)

సీ॥ అక్కటా నన్నిటు ల ♦ గడుసేయుట న్యాయ
మగుజుమీ నీ ♦ కిదేతగు విధాత
ప్రాకృతుల్ గారు స ♦ ర్వజ్ఞులు మీరలి
ట్లికనక్కమాడిన ♦ నేమి జెపుదు
కోడెపాయపుదాని ♦ కీడుగానిముసలి
వాడికి చేడెగానేడు జేసి

తయ్యయో దెల్పెద ♦ మనమదిలో చెంపు
సిగ్గుబోడముచుండె ♦ నగ్గలముగ

గీ॥ నిచటగలవారలిక్కథ ♦ లెల్ల వినఁగఁ
గేలిసేయుదురైన ♦ నాకేలసిగ్గు ?
కాముకులకెల్ల జ్ఞానము ♦ గల్గకుండ
జేసితిరి సిగ్గువిడిచి మీరు ♦ చెప్పనేల ?

కమలాసనా ! యీసుకుమారుండు నన్నేలు కమలజారికి గల్గిన వాడని మీరెఱుంగరా ? నన్నిట్లు గేలిసేయదలంచి యడుగుచుంటిరి గాని (సిగ్గుచే తలవంచును.)

బ్రహ్మ—(సంతోషించి) తారా ! నీవు నిజమాడితివి. అందునకు
చాల సంతసించితిని. నీకు శుభమగుగాక ( చంద్రుని జూచి )
సరసిజారీ ! యివ్విరిబోడిని యగ్గురునకు సమర్పించుము. ఈ
బుధుఁడు నీకు గల్గినకతంబున నీతని జేకొనిపొమ్ము.

చంద్రు-చిత్తము (అని బుధునెత్తుకొని)కనకగర్భా ! శెలవొసంగుడు.

బ్రహ్మ-మంచిది పోయిరమ్ము. (చంద్రుఁడు నిష్క్రమించును.)
తారా ! యీగురునితో నీగృహంబునకేగి సకల సౌఖ్యము
లనుభవింపుము.

తార-చిత్తము. పోయివచ్చెదను. అనుగ్రహించుము.

బ్రహ్మ—గురువరా ! మీవిరిబోడితో గలసి సుఖముగా భవనంబున
కరుగుము. సందియమందకుము. సర్వమెఱింగిన మీకు నేజెప్పఁ
బనిలేదు. స్వీకరించి జనుడు.

బృహ-చిత్తము. అట్లనే పోయెదము. (యిరువురు నిష్క్రమింతురు)

ఇంద్రుడు—శతధృతీ! మాకు శెలవొసంగుము.

బ్రహ్మ—మీకు శుభమగుగాక. (అందరు నిష్క్రమింతురు.)

(అవనిక జారును.)

గద్య॥ ఇది గూడూరి కులాంబుధిజనిత బోధాయనసూత్రి
భారద్వాజసగోత్రి మల్లయాఖ్యపుత్ర వేంకటశివా
భిధ విరచితంబగు తారాచంద్ర విలాసము
పంచమాంకము
సంపూర్ణము.

---

ఫ ల స్మృ తి.

సీ॥ కామాతురుండయి ♦ కమలారిగురుదారఁ
బొందిలోకులచేత ♦ నిందబడుట
గాక పాపమునూటఁ ♦ గట్టుకొనియెగాదె
గావున పరకాంతఁ ♦ గలియగోరఁ
దగదు పూరుషులిల ♦ దారాపతిని బ్రహ్మ
సురవరేణ్యుండాది సురలువినఁగ
నిజము జెప్పుమటన్న ♦ గజిబిజియైసిగ్గు
బొడమ సిరమువాంచి ♦ పొగిలిపిదప

తే॥ సత్యమాడుటచే బృహ ♦ స్పతియు దిరుగ
దారనింటికిగొనిపోయెఁ ♦ దరణులెల్ల
రిట్టినీచపు పని జోడి ♦ గట్టిరేని
రౌరవమడఁగు! నరకంబు! ♦ కారణంబు!



# తారాచంద్రీయము

## అనుబంధము.



బృహ- 1. జంఝూటిరాగం—ఆదితాళం.

గొంటుతనంబేలర ♦ గురువటంచు నెఱుఁగర
తుంటరి నీనిజుల నహు ♦ గంటజేతుఁజూడర ॥ గొం ॥
భయముభక్తి రెండువిడువ ♦ బాడియౌనె దుర్మతి
రయముగా నీమేనురక్త ♦ మయముగానొనరింతురా ॥ గొం ॥
మాటిమాటికెదురుబల్కు ♦ మతము నెవఁడుచెప్పెరా
పాటిగాఁబలుగాకి దాడ ♦ పండ్లునూఁడగొడుదురా ॥ గొం ॥

అత్రి- 2. ధన్యాసిరాగం—ఆదితాళం.

మాతనయామే ♦ మీతరిచెప్పెడి ♦ నీతులవినర బ్రి ♦ ఖ్యాతి మనంబున ॥ మా ॥

సౌమ్యులలోన ని ♦ జమ్ముగ విద్యాధ ♦ నమ్ముతోసరి ది ♦ మ్మహి లేదుర ॥ మా ॥

గనబసిండికి జెలి ♦ కునకు వాసన చిత్ర ♦ మునకు ప్రాణము పోల్కి ♦ మనకది వన్నెదెచ్చు ॥ మా ॥

- శివితోడుతనీవా ♦ దేవాదిదేవుని సేవించురీతి గురుని ♦ సేవించి విద్యగాంచు ॥ మా ॥

సేవ- 3. నాటకరంజి—ఆదితాళం.

వినుడిదెల్పెద ♦ నతి ♦ వేడ్కమీరఁగ ♦ అనిమిషాధిపుండు బంపె ♦ నయ్యరయముగా ॥ వి ॥

జన్నమొక్కటి సేయ ♦ నెన్నిబుద్ధిని ♦ నన్ను మిమ్ముదోడితె ♦ మ్మన్నవచ్చితి ॥ వి ॥

సరసమొప్పగ ♦ సుర ♦ వరునియాజ్ఞను ♦ గరిమ దొరగనట్టి
మీరు ♦ త్వరగరండిక ॥ విను ॥

తార- 4. జంఝూటి—రూపకం.

ఇంటనొంటినుండజాల మీ ♦ వెంటనంటివచ్చెద ♦ గెంటరాని
తమకమునను ♦ కంటగించె నొచ్చెద ॥ ఇం ॥

గొంటుతనము బూని నాదు ♦ జంటబాయ సిద్ధమా ♦ తొంటి
ప్రేమలెల్లను నడు ♦ గంటఁజేయ న్యాయమా ॥ ఇం ॥

మిమ్ము బాసిన క్షణమునకు నా ♦ మేనఁ బ్రాణములుండునే ♦
మమ్మురమైనట్టి బలుమో ♦ హమ్మునా పైఁగమ్మెనే ॥ ఇం ॥

పరిపరి విధములను జూడ ♦ బ్రహ్మదేవుడిప్పుడు ♦ స్థిరముగనెడ
బాపె మనలఁ ♦ గరుణారసహీనుఁడు ॥ ఇం ॥

బృహ- 5. నాటకరంజి—ఆదితాళం.

ఇంతీ! చింతించనేలనే ♦ మనయింటియందునే ♦ నిందుని నుం
చెద ॥ నింతీ ॥

సురనాథుడాయఁజేరి ♦ భూ ♦ సురవైభవమును ♦ జూచి వత్తు
నివు ॥ డింతీ ॥

జన్మమునందు నింద్రుఁడు వే ♦ డ్కన్నాకిడు మణులన్నే దెచ్చెద॥
అరమరలేక మీాదట యు ♦ క్కటి వేల్పు ముద్దు ♦ మరదిని
బ్రోవనె ॥ యిం ॥

బృహ- 6. హిం॥ తోడిరాగం—జుల్వా.

సెలవొసగి నన్పంపవే ♦ చెలియరో వేవేగమే ♦ బిలువగనంపె
న ♦ విబుధనాయకుఁడు♦నిలుచుటబాడియౌనె వో♦నీరదనీలవేణి ॥ సె॥

ముల్లోకములనుదాఁగడు ♦ చల్లని చూపు ల్వైద ♦ జల్లి ♦ బ్రో
చుదేవ ♦ వల్లభునుల్లము ♦పల్లవమందునుగ నే ♦ మెల్లగనట కేగగ॥ సె ॥

అతిథియభ్యాగతుల ♦ పూజ ♦ హితమతి ♦ నొనరించవే ♦ కు
తుకముతో శిష్య ♦ తతిని బ్రోవుమతి ♦ వెతలిక జాలించవే ♦ నీమతి
గ్నినే మరకవే ॥ సె ॥

కరకరిలేకమరి ♦ శ్రీ ♦ కాంతుని పరదీతరి ♦తరుశిరోమణియాజ్ఞ దాటఁగజాలని ♦ సరసుఁడు బహువెరవరి వాని♦మరువక వేనేర్వరి ॥సె॥

తార— 7. రాగం—ఆదితాళం

ముచ్చటలాడవదేర ♦ ప్రేమ ♦ ముప్పిరిగొనెగదచాల♦చంద్ర! ముచ్చట పచ్చవిల్తుడెద ♦ హెచ్చు బాణములఁ గ్రుచ్చసాగెనిదో జూడు వలపు హెచ్చె గదర నీతోడు ♦ చంద్ర ॥ ము ॥

ఒంటిగ నబ్బితివౌర మోవి జుంటితేనె లివిగోర ♦ పంటనొక్కినను ♦ తుంటరి మరుఁడను ♦ గంటిపోవుగద నేడు లే కుంటె ప్రాణములతోడు ♦ చంద్ర ॥ ము ॥

ఊరికేగె సురగురుఁడు యిపు డొప్పుగ రాఁడా ఘనుఁడు♦తారుణ్యమిదివి ♦ ధాత్రుని దయమన ♦ పైరంజిలెఁ చెంతజేరు మదికోరిక నెల్లను దీరు చంద్ర ॥ము॥

మోహ— 8. రాగం జుల్వ.

శిరమునంటుచుండె శశికి ♦ చెలువు మెరయఁగా ♦ కరము సంపంగి తైలముననుకరముల బంగరుగాజులు కంకణములు ఘలుఘల్లన॥శిర

నలుగు బెట్టుచున్నది ♦ చిరునగవు మోముతో ♦ నలరుకమ్మలు మృదుకపోల ములపై తళ తళ యను కాం తుల దళ్కుల నొలుకు చుండ ॥ నలు ॥

వీకను బన్నీటనునభి ♦ షేక మొనరిచి ♦యేకతముగ నెరికురుల దడి నెల్లనొత్తి మెల్లనార్చి చల్లగఁజిక్కెల్ల దీర్చి ॥వీకను॥

తిరముగు గస్తూరిదెచ్చి ♦ తిలకముదిద్ది ♦ వరభూషణములను బెట్టి యరమరవిడి విరిజాజులు విరులశిగకు♦నరిదిజుట్టి ॥తిరముగు॥

సొగసుగుల్కునట్టిపనులు ♦ సుదతిజేసెను ♦ జగదీశ్వరుఁడై నఘనళ సరసిజలోచను మరదికి సరభసముగ సరసంబుగ ॥శిర॥

తార— 9. రాగం జుల్వ.

కందుకక్రీడను ♦ పొందుమీరనాడను మనము॥కం॥

క్రందుగన రామంబున ♦ కందముగాను ♦ చెందము లానంద

మంద ♦ తొంచర.గాజని॥ (బంతులాడుచున్నారు.)

రాసకేళులాడెద ♦ రాజా! నిన్ను గూడెదనిక ॥రా॥

భాసురముగ నీతోనిట ♦ గాసంతైన ♦ ఈసరినే ♦ సరసంబును

వీసర బోనీకను మరి ॥రా॥ (రాసక్రీడ లాడుదురు)

నేడుజోడువాయక ♦ నెమ్మినుందు నాయక ॥నే॥

ప్రౌఢతనము వెలయఁగనులఁ ♦ జూడుమీడుగ ♦ గూఢమణి

యాఁట ని ♦ గూఢముగా నాడెదభళీ॥నే॥ (పిల్లియాటనాడవలెను)

విరివి నామొరలనువిను ♦ మరయలోక త్రయమును ♦ పరగ

బ్రోచుచుండెడి శ్రీ ♦ హరి దయచేత ♦ సురగురుఁడా సురపతికడ ♦

కరిగెఁగదా ♦ సరభసముగ ॥ విరి ॥

చంద్రు- రాగం—ఆది.

వనము సౌందర్యము ♦ వర్ణించనేరము ♦ ఘన సౌరభము ♦

గల్గి ♦ విలసిల్లె నుప ॥వన॥

సకలకాలముల ♦ వికసించు బూవుల ♦ ప్రకటితమగుఫల భరి

తమైనది బళా ॥ వను ॥

శుకపికాలాపము ♦ చూడ వినచోద్యము చకితమెరుంగని వ♦సం

తుని మహిమముప ॥వన॥

తార- 11. దర్బారురాగము—ఆట.

నమ్మితిరానామే♦నమ్మితిరానీకు కమ్మవిల్తుని కేళి గలయరసామి॥

మానర వగలిక ♦ నానరమోవి నీ ♦ దానరనీనద ♦ మానర

బోవగ్రిర ॥ న ॥

రారాపాన్పుకు ♦ రావులింకేలర ♦ మేరానేనీ సా ♦ మ్మేరా

మేలర ॥న॥

మేలర చలమిక ♦ జాలురయేచుట ♦ బేలనురా న ♦ న్నీడుట

తగదుర ॥న॥

తార- 12. కేదార రాగం—ఆటతాళం.

సరసిజారి ! సరసమువిూరి ♦ విరివిలుతుగ్రిడల బెనంగుము

డుకలరఁగ నేఁడునాతో ॥

చంద్రు- సరసిజాక్షి! పరపురుషు జేరి ♦ విరహావేదన కోర్వలేనని విగ్ర హిగెడు వెట్టిరీతుగ॥

తార- గురుఁడుమున్ను ♦ గొప్పగనిన్ను ♦ కరము ప్రియుఁడిగ నెన్ను మని యన గాను నీవది ♦ వినగలేదె॥

చంద్రు-హారిహారీ యే ♦ మందు గురుండు ♦ సరసమతి నిల్లించి యనె నా సంతసంబుగ సంశయించక॥

తార- 13. హిం॥ తోడి—చాపుతాళం.

చాలుపోచాలునీతు ♦ లేల దెల్పెదవుర ॥చాలు॥

ఏలర చలమేలర న ♦ న్నేలరతి దేలర ♦ బలె ॥చా॥

సురుచిరంబుగ గన్న సుతయని యనక ♦ నిరయము వాణిని గూడడె నీపితామహుఁడుగాడె॥ మును పరాశరముని యో ♦ జనగం ధిని గలయఁ గను నేరముజేసివెలి బె ♦ ట్టినవారలు గలరెధర॥చాలు॥

కులములోపల వన్నె ♦ కొలది తరిగెనా? అల మేనరిక చుట్టరి కం బా విశ్వామిత్రునకు॥చా॥

ఇంద్రుఁడొప్పుగ న హాల్య నేలినాడనుకొని ♦ సాంద్రముగా సురలువాని ♦ స్వారాజ్యమేల నీరై రె ॥ చాలు ॥

అరమరలేలమరి విరి పానుపుజేరి తరి మరుమరమున స రాసరి గరకరినన్ను బెనఁగుమిక ॥ చాలు ॥

తార- పీలు—ఆట.

వలపునిలుపఁగఁజాల ♦ వలుకలేమిటికి నా ♦ తళుకు చెక్కుల ముద్దులిడుకోర సామి ॥వలపు॥

మొలకనవ్వులముద్దు గులుకుచు నాతోడ ♦ బలుకవదేలర ? పగతురాలనుగాను ॥వలపు॥

నిలువదు నామది ♦ నీతులింకేలర ? అలనీబావబృందఁ ♦ గలసి సుఖింపడె ॥వలపు॥

వరత్రివిష్టపముల బాలించు హరిమఱది ♦ కరుణనేమరి యిం

త కనరు జూపెద వేర ॥వలపు॥

తార- 15. బేహాగ్—ఆది.

మారా నీబారికోర్వలేరా శ్రీకు మారానారీమణులనేచ న్యా యమటర. ♦ శ్రీకుమారా ♦ శరణు శరణని వేడితిర నాపై గరుణచే శరపరం ♦ పరలంబరపకు శ్రీకు మారా॥

నీసాయకములకునోడి పాక శాసనుకోడిమకూతం గూసెదర॥శ్రీకు।

ఆమాయదారి దైవమ్ము కూడ నీమాయచేత నన్నేమిసే యునో ॥శ్రీకుమారా॥

చంద్రు- 16. హిం॥కాఫీ—ఆది.

తలుపుదీయవెతార ♦ తడవేల గుమనిదార ॥త॥

తలుపుదీసినను దయజూచి బ్రోవకున్న ♦ నిలిచి మాటాడజాల నే నిముషమైననే ॥తలుపు॥

తార- తలుపుదీయనుపోర ♦ తడవీడ జేయకుర ॥తలుపు॥

తలుపుదీసినను నే ♦ నిలుజోరనిచ్చిన ♦ అవికులవేణులందరు ♦ హాస్యమాడుదురు॥

చంద్రు-ఈలాగు రిత్తగాం గాలముగడపిన ♦ నేలాగు దాళగల ను యికమీదనేను ॥తలుపు॥

తార- చాలుచాలుర నీ ♦ సరసము దెలసెనిట్టి ♦ యాలోచ న లింకేలర యీడిక లేపదరా ॥తలపు॥

చంద్రు— అక్కటా నీవేనట జిక్కులువెట్టిన నెక్కటివాడ నౌదునే పెక్కులేలనే॥

తార- చక్కగానీవిటు ♦ లెక్కుడుగావెకసక్కెములాడగూడునే నక్కరగలనే తలుపుదీసితిగదరా తగలరాకురా॥

చంద్రు- 17. హిం॥ తోడి—జుల్వరాగం.

తాళగజాలగదే వో తలిరుబోడినీకు దండముబెట్టెద॥తా

నీలవేణినో నీ వీలానేరములం ♦ జాలనెన్ననేరి ♦ పాలౌదు నక్కటా ॥తా॥

జీవము నిలువదు ॥తా॥

జాలమేలనేనీమేలైన మోవిని ♦ గ్రోలనిచ్చినా ♦ కోరికలీడేర్చు ॥తా

ధీరతతో హారా హారిగనిల్చి వి♦స్తారమా మరునితో బో

రవశమె మరి॥తా॥

బృహ- 18. హిందూ॥ తోడి—ఆదితాళం.

ఓసీ!సాహసీ ♦ నను ♦ మోసబుచ్చితివ హాసీ ॥ ఓ ॥

వాసవాది సుర వర్యులలో నా వాసివన్నె పరి హాస మా

యెనిక ॥నో॥

నాతీ!దుర్మతీ నీ నీతి వినయములు నిజమని నమ్మితి ॥ ఓసీ

పాతకి ! క్షితిని ధాత నినుగులట జాతిజేసెనా పాతకినేర్పరి ॥యో

బోటి! నీసాటియగు బోటులెల్లఁబతి మాటదాటుదు రె ? ॥బోటీ॥

ధాటిగ శ్రీహరి తప్పెటింగి మీ లాటి బోటులను ♦ తాటయొ

లువడే ॥ యోసీ ॥

చంద్రు- ఆనందభైరవిరాగం—చాపుతాళం.

ఎనలేనితరి ముద్దుగుమ్మా పటి కనునాగ్చిన పసిడిబొమ్మ ॥యె॥

ఘనముగ మరుకేళినేలుదానికనుగవదమ్ములఁగనుగొన్నజాలునె॥

సరసిజాక్షి పుష్పశరము మంచి ♦ సరసపకా తొలుకారు

మెరుము దిరముగ దుమ్మెద చయము పోల్కఁ దెరలు తెగబారెడు

కురుల సముదయము ॥ నెన ॥

పలుకు పలుకుకు తేనెలొల్కు వహావ్వా కులుకొక కోటి

వరాలు రాజిల్కు అల మాయదారి దైవముకు కరుణగలుగునోగలు

గదో కఠినచిత్తునకు నెనలేని॥

చంద్రు- 20 బారువ—ఆది.

పున్నమచందురుబోలెడినెమ్మోము కన్నులనే జూచుచున్నడో॥

క్రన్ననానఖాగ్రముల తోడఁ దానిచన్నులపైనాటు చున్నడో॥

మధురసంబు లొల్కు సుదతి కెమ్మోవిని ముదముతో

నేనానుచున్నడో ॥

పదపడి వక్షము వక్షము నందున ♦ గదిసికౌగిట జేర్చు ♦ టెన్నడో
పనివడిచౌశీతి ♦ బంధనములతోడ ♦ ఘనరకులను దేల్చు ♦ టెన్నడో॥
దనరగ నాపాలి ♦ దైనము మమ్ముల గనుఁగొను ♦ తెలి
యింకెన్నడో॥

చంద్రు— 21 హిం॥ తోడి—ఆది.

ఎటులోర్తు నేయిక ♦ కుటిలకుంతలినే ♦ మటుమాయదారి దైవ
మిటు సేయుట లెరుఁగ ॥ మె ॥
చెఱకువిలుకాడు ♦ సుఱచుఅలాడు ♦ చిఱుతపయ్యెర నేడు చిఱు
తగండ్లయ్యె జూడు ॥ మె ॥
అరూషిగామాయ ♦ దారి దేవునియుల్ల ♦ మేరీతిగలదో మళ్ళా
నెల్లకోరిక లోల్లో నెటు॥

చంద్రు— 22. షీలు—ఆది.

చెల్లెలిపట్టి వైయుల్లముజల్లుమన ♦ పుల్లాంభోజా ♦ స్త్రంబుల నెద నేసెదు॥
మామనటంచు వే ♦ మారుదలంచక యేమిరా యిపుడునా ♦
తో మాఠ్కాని మెదు॥
అదను గనుంగొని యెదురిక లేదని ♦ యదరిపడెదుమది ♦ బెద
రును దిగవిడి॥

తార— 23. కాఫీ—జుల్వ.

కొమ్మా యేమిసేతునే ♦ ముద్దుగుమ్మా యేమిసేతునే ॥కొ॥
కమ్మవిల్తుడు బా ♦ ణమ్ములురమ్మున ♦ ముమ్మరమ్ముగను ♦ గ్రమ్మెను
గ్రమ్ముగ ॥కొ॥
కోయిలలు గుమి ♦ గూడిగూడిమరి ♦ కోయనికూతలఁగూయ
సాగగనో ॥కొ॥
తుమ్మెదలు తల ♦ దిమ్మని యనఁగానమ్మ జేయుచుండె ♦ దో
మ్మిగానిట మూగి ॥కొ ॥
ఇమ్మహిపాల జేయ ♦ నెమ్మినవ్విధిధయు నెమ్మదిజూడ ♦ దూ
మ్మయ్యె నయ్యారె ॥ కొ ॥

తార— 24. కీలు—అట.

కాంతామణివినవే ♦ సంతోషమతిని ♦ సుంతైనదాచక సూచన జేసెద ॥౧॥

చిత్తజాకారుఁడు♦జేరినపాన్పునన్ త్రిగిలనియీ♦రెమొదలిన నేలనే॥౨

రమణునితోఁగూడి ♦ రతికేళిదేలని రమణిరో యీపరు♦వముగు ప్రాయిము దేల ॥ ౩ ॥

భూరిగనామాయ ♦ వారిదైవమునకు కారుణ్యముఁరాని కారణమేమొకో । ౪ ॥

చంద్రు— 25. కీలు—ఆది.

చేరరావే ♦ శృంగారవతితార ననుచేర

మారుని బారికి ♦ యోరువలేనే ॥ననుజేర॥

బారసాచి తమి ♦ దీరగనాకిట గారవముగ బిగి♦ కౌగిలిచ్చుటకు విరహంబను తాప ♦ జ్వరమున దగిలితి నిరవుగానీయధరా ♦ మృత మను మందిడ ॥ జేర ॥

పరిపరివిధములఁ ♦ బరితపించెనే మది♦కరుణ యుంచవె ము♦ప్పరి గొనెగాభ్రమ॥ 26 అనుబంధము.

కొమ్మానమ్మిలిగదె సుమ్మా ♦ న్యాయమ్మా విడ॥కొ ॥

సమ్మతిగ రొమ్మునందు రొమ్మునుంచి గ్రుమ్మిదయచే ॥కొ॥

ఇమ్ముగ గపురవిడెమ్ము నాకునిష్టమ్మటంటిబో సుమ్మా యిటు రమ్మా దోసమ్మా ♦ నెమ్మోమును ముద్దులిడుకొమ్మా ♦ నెమ్మోమునందు ప్రాణమ్ములుండవిక ॥ గొమ్మా ॥

బృహ— 27. రాగం—ఆది.

మోసమాయెనోయివాసవా ♦ యింతలోనెంతో ॥మో॥

ఈసరిఁబొసఁగిన నా వెత ♦ లేమని తెలియబల్కుడు ॥మో॥

భాసురాంగితార నన్నెడ ♦ బాసిపోయినందులకు హాసరివారలీ ధరలో ♦ గాసుగా గన్నులగనరె ॥మో॥

కండకొవ్వుబట్టిమెండు ♦ గండుమీరి చంద్రుఁడు నా యండ

జాక్షి తారను తన దండజేర్చుకొనియుండె ॥మో॥

తిరముగ నీలోకమందుఁ ♦ బరిభవమయ్యె నీబ్రతుకు బరమేశ్వ రుని కరుణారస ♦ మిరువుగా నెట్లుండునోగద ॥మో॥

శైవ— 28. నాటకరంజి| జుల్వ.

సరసిజారి నిన్నుజేరి ♦ చక్కఁగ నిట్లనుమనె హారి ॥స॥

గురుశతియౌ తారను మిము ♦ గొని రమ్మనిపంచను మరి |స|

ఆపద్ధతి జేయవేని ♦ నీపట్టణమునకాతఁడు చేపట్టసమూనివచ్చు నీపుట్టినుంచి హెచ్చు | స |

మోమాటము లేదుసుమీ ♦ నామాటల నాలించుమి కామినిపై భ్రమమానుమి ♦ గ్రక్కున బోదమురమ్మి ॥సర॥

తార— 29. హిం| తోడి—ఆది.

అకటానన్నిటు ♦ ల గడుసేయ న్యాయ ♦ మగునా నీకుతగునా

ప్రకటితమతివి స ♦ ర్వజ్ఞుఁడవైన నీ ♦ వెకసెక్కెమాడిన నే మని చెల్పుదు ॥న॥

కోడె ప్రాయపుదాని కీడుగాని ముసలి ♦ వాడికిసతినిగా నేడుజేసి యుంకా ॥ న ॥

తెలుపుదుననమది ♦ దెంపుసిగ్గుగ్గలై ♦ దెలుపక దీరదీ ♦కలవారి లోపలఁనక్కటా న ♦ న్నిటు లగడు సేయ న్యాయమగునా నీకుతగునా ॥న॥

సంపూర్ణము.

---

# పురూరవ.

ఇదిముద్దులొల్కు పద్యగద్యములతోను పార్శి కర్నాటక మట్ల ననుసరించినపాటలతోను మనోహరమగు శైలిలో రచియించిననాటకము ఇందు పురూరవునిసత్యము జయప్రదపాతివ్రత్యము. సత్యవంతధర్మ శీలుర ధైర్యము. వర్ణ నాతీతము. నవకోటినారాయణసెట్టి దురితము మిగులదుఃఖమునుగల్గించును. ఇది 16పేనుల గ్లేజుపేపరుమీదరాయల్ సైజున ముద్రించినారము వెల కాపి రు 1—4—0.

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 1 | 12 | మాకోసగు | మాకోసను |
| 1 | 27 | తాదృశ్యడా | తాదృశ్యకా |
| 4 | 6 | నింపెంద | నింపాంప |
| 4 | 9 | సత్కృ | సత్కృత్తి |
| 4 | 19 | కలితోక్వ | కవితోక్వ |
| 4 | 19 | నిధిజయగు | నిశ్చయను |
| 4 | 22 | సధ్ధి | సరిధి |
| | 30 | జారబడి | [illegible]బడి |

ఇవి మొదటి నాల్గు పేజీలలోని గల లోపములు. దయతో చదువరులు దిద్దుకొన ప్రార్థించెద.

| | | | |
|---|---|---|---|
| 1 | 9 | సకలకాశా | సకలకళా |
| 2 | 13 | పల్లయ | మల్లయ్య |
| 5 | 9 | గొంటి | గొట్టు |
| | 12 | జో కాట | జోకాట |
| 8 | 17 | పురంవిరా | పురందరా |
| 9 | 16 | స్కంద్రదే | స్కందే |
| 10 | 2 | మృత్యజీవు | మృతజీవు |
| | 8 | నమ్మగిన | నమ్మనగని |
| 12 | 11 | గొంటెపతనము | గొంటుపతనము |
| 14 | 20 | సంసలం | సంససలం |
| 15 | 25 | జల్ల | జల్లి |
| 16 | 19 | మోహామునసన్నిట్లు | మోహామునన్నిట్లు |
| | 26 | దలపుచుండు | గలపుచుండు |
| 20 | 3 | గద్దయ | గద్దియ |
| | 4 | చున్నద | చున్నది |
| 23 | 20 | ఉద్యానవనము | ఉద్యానము |
| 24 | 18 | కేశరము | [illegible]రము |
| | 20 | నిర్వాణము నెంతో | నిర్వాణము లెంతో |
| 25 | 4 | వచోరరచనం | వచోరచనం |
| | 8 | బోపుదమా | బోదుమా |
| 28 | 10 | నిజుమ్ము | నిజమ్ము |
| 29 | 1 | మన్నముల | మన్ననముల |
| | 4 | మనవిని | మనవిపిని |
| | 6 | వింతయే | వితయే |